ప్రచురణ నెం. 3.

ప్రథమ ముద్రణ

ఏప్రిల్ 1955

వేయి ప్రతులు.

వెల:- 1-2-0



ప్రతులకు:

శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు,

హనుమకొండ :: వరంగల్.

ప్రచురణ:

యశోధర ప్రచురణ

హనుమకొండ, వరంగల్.

ముద్రణ:

శ్రీ రామలింగేశ్వర ప్రెస్,

వరంగల్.

## అంకితము:—

కథా సాహిత్యమన్నా, నవలా సాహిత్యమన్నా ఎంతో ప్రేమిస్తూ, వయస్సులో నాకన్న పెద్ద అయినా, బాల్యం నుంచి కలిసిమెలిసి నాతో జీవితం గడుపుతూ, నా అభివృద్ధి కోసం, అహర్నిశలూ ఆపరాత్పరుణ్ణి ప్రార్థించే, అమృత హృదయుడూ, ఆనందమూర్తి. అయిన మా నాల్గవ అన్న పుల్లాభొట్ల రాఘవశర్మగారి పాదపద్మాలకు భక్తితో సమర్పించిన కథాపుష్పగుచ్ఛం.

# ఇందులో



మా

మూడవ ప్రచురణ :- శ్రీ. శాంతి కృష్ణమూర్తిగారి
"కృష్ణాంజలి" (కథల సంపుటి)

నాల్గవ ప్రచురణ :- శ్రీ. వల్లారామ కోటార్యగారి
"వినగదప్ప వెర్రి వెంగళప్ప (హాస్య పద్య సంపుటి)

# ప్రవేశిక.

ఈ కథా సంపుటిలో నాల్గు కథలున్నాయి. మొదటి కథ ఆంధ్రపత్రికలో ఇదివరకే ప్రచురితమైంది. ఆవిధంగా ఈ కథకుడు ఆంధ్ర పాఠకలోకానికి పరిచితుడనే చెప్పాలి.

'వెత చెప్పదలుచుకున్నా, కతవలె చెప్పాలి. లేకుంటే ఎవరూ వినరు. కతగా చెప్పితే ఎన్ని వెతలైనా వింటాడు మనిషి. ప్రత్యక్షంగా కనులముందు జరిగే విషయాలను లక్ష్యపెట్టనివాడు సైతం, ఆ విషయాలనే కథారూపంలో చదివి (విని) తాత్కాలికంగా నైతేనేమి, ప్రభావితు డౌతాడు. కథంటే వేదంకాదు. పురాణంకాదు. శాస్త్రం కాదు, వ్రతమహాత్యం కాదు. చరిత్రకాదు. వార్తకాదు. మతచర్చకాదు. శాస్త్రీయతత్వవిచారంకాదు. కథంటే కథ. మానవ జీవితంలోని ఒకానొక సంఘటన. దానికి అక్షర రూపం యిచ్చిన కథకుని శిల్పచాతుర్యం. కథలోని ఘట్టం సామాన్యమైనదే. పాత్రలు సామాన్యమైనవే. కేవలం రచనా విధానమే అపూర్వం. ఈ అపూర్వతే కథావస్తువు ఏదైనా సామాజికుని, సమరసునిగా చేస్తుంది. కథ పేరుతో ఆకర్షితుడై, మొదటి వాక్యంతో పట్టుపడి, పాఠకుడు కథంతా చదివేస్తాడు. విసుగు పుట్టదు. కాలక్షేపం జరుగుతుంది. ఇట్లావుంటేనే కథ సార్థకమైనట్లు. కథకుడు యోగ్యు

డైనట్లు. అంతేకాని కథతో జీవితం ఉద్ధరింప బడుతుంది. సంఘంలో గొప్ప మార్పువస్తుంది. దేశంలో విప్లవం చెలరేగుతుంది. జారిణి పతివ్రతగా మారుతుంది. సంసారం చేసే స్త్రీ కథ చదివి ఎవరితోనో లేచిపోతోంది— అంటే అవన్నీ గప్పాలు.

పుల్లాభొట్లవారి కథలు కేవలం పేరుకే కాదు నిజంగా కథలే. ప్రతి కథలో విషయం వుంది ఆ విషయం చెప్పటంలో వొడుదొడుకులు లేవు భాష గతుకులు లేకుండా నడిచింది. సంభాషణలు బాగున్నాయి. కథలను, విసుగు లేకుండా చదవవచ్చు. కాలక్షేపం జరుగుతుంది.

పాత్రలకు సంబంధించినవైనా కథకు అవసరంకాని వివరాలు అక్కడక్కడా వున్నాయి. అవి లేకున్నా అసలు కథకు లోటులేదు. ముందు వ్రాసే కథల్లో అనవసర వివరాలు తగ్గించుకుంటే వీరు వ్రాసిన కథలు, ఒకసారే కాదు మళ్ళీ మళ్ళీ చదవాలనిపించేలా గుంటాయి.

ఒకసారి చదివితే మీకే తెలుస్తుంది వీరి కథల విలువ.

హన్మకొండ,<br>21-1-56.

**కాళోజీ నారాయణరావు,**<br>తెలంగాణా రచయితల సంఘం, అధ్యక్షుడు.

# రెండు మాటలు.

ఈ సంపుటిలో కథానికలు ఉన్నాయి. ప్రతీ కథా వస్తువూ సాధారణంగా సమాజంలో కన్పించేది వాటిని తెర తీసి, తప్పు ఒప్పూ, పాపం పుణ్యం అని నిర్ణయాల మధ్య నలిగిపోయేకన్న, ఎదుట పెట్టడంలోని రచయిత ధైర్యం అభినందించ వలసిన విషయం. దానివల్ల ప్రతీకథానికా, హృదయాన్ని కదలించి, ఎక్కడో జరిగినదే అన్న భావన స్ఫురించడం. దాంతో తాధ్యాత్మత కల్గడం తప్పదు. దీనికి రచయితను అభినందించవలసివుంది.

పైగా అంగాంగీయాలైన, వర్ణనల్లో, ప్రతీ చిన్న చిన్న విషయాన్ని, మర్చిపోలేనంతగా కళ్ళకు కట్టినట్లు కుంచె సారించడంలోని నేర్పు. మృదువై, సజీవమైన భాష. ఎత్తుగడ అన్నీ కూడా మిళితమై, కథానికలకు ఓ క్రొత్త సంచాలింపు కల్గచేసేయి అంటే అతిశయోక్తి కాదు. దాంతో మున్ముందు చేయి తిరిగి, హృదయాన్ని కదలించే, కథలును ఆశించడం కూడా కల్గుతోంది

యువకులు, అభ్యుదయ భావకులు, ఉత్సాహవంతులు అయిన శ్రీ. పుల్లాబొట్ల వెంకటేశ్వర్లుగారికి, శ్రీ యశోధరా ప్రచురణ కర్తలకు, అభివందనాలు.

హనుమకొండ,
22-4-55

కందుకూరి లింగరాజు.

# నా మాట

కొందరు సహృదయులు, పూజ్యులు నా కథల్ని పాఠక లోకానికి అంద జేయడంకోసం కొంత ధన సహాయంచేసి నన్ను ప్రోత్సహించేరు. వారికి నేను సర్వదా కృతజ్ఞుణ్ణి అందులో కొందరు తమ పేర్లు ప్రకటించటానికి అభ్యంతరం తెలిపారు అందువల్ల కొందరి పేర్లు ప్రకటించి, మరికొందరి పేర్లువదలటం భావ్యంకాదనే తలంపుతో పేర్లుప్రకటించటం మానుకున్నాను.

అమూల్యమైన అభిప్రాయాల్నిచ్చిన శ్రీ కాళోజీ, కందుకూరి, శాంతి మొదలైనవారికెంతో కృతజ్ఞుణ్ణి. ఆంధ్ర పాఠకలోకంగూడా నారచనని ప్రోత్సహిస్తే ధన్యుణ్ణి

ఇట్లు మీ

పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు

# విజ్ఞప్తి.

మేము సహృదయులగు, పాఠక మహాశయులకు మా రెండవ కాన్కగా శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లుగారి, కథల సంపుటిని అంద జేస్తున్నాం.

మా తొలికాన్కను ఆదరించిన ఆంధ్ర ప్రజానీకానికీ, ఆంధ్ర పత్రికా లోకానికీ, ఈ సందర్భంలో కృతజ్ఞత తెలుపలేకుండా వుండలేకపోతున్నాం. అదేవిధంగా ఇక ముందుకూడా తగు ప్రోత్సాహమీయ ప్రార్థిస్తున్నాం.

సంపాదకుడు:

# పుట్టుమచ్చ.

శేఖరానికి తండ్రిగారి దగ్గరనుంచి 'అర్జంటుగా రావలసింద'ని ఉత్తరం రావటముచేత, ఏమిటోనని భయ పడుతూ గాభరాగ బయలుదేరాడు.

ప్రఫుల్లభర్తతో "భద్రమండి రైలు కదులుతూవుంటే ఎక్కేరు. తొందరలో సామాను జాగ్రత్త, దొంగలుంటారు, మీకసలే నిర్లక్ష్యం, మతిమరుపు జాస్తి. బెడ్డింగు–సంచి దగ్గర పెట్టుకోండి" అని మరల; "మరచిపోయాను– బేంకుకు శలవుపెట్టారా–లేదా? వెంటనె తిరిగి రాండి. ఒక్కదాన్ని ఇంత పెద్దబస్తీలో ఉండటం ఎంతకష్టమో మీకు తెలుసుగా? అదీగాక చిట్టి మిమ్మల్ని విడచిపెట్టి ఒకక్షణం కూడ వుండ లేదు. పొద్దుగూకులు 'నాన్న–నాన్న' అంటు కలువరిస్తుంది. అత్తగారిని, మామగారిని అడిగినానని చెప్పండి నేను చెప్పిన సంగతులు మరచిపోయేరు." అని చెప్పింది.

"నాకేమి ఫరవాలేదు ప్రఫుల్లా! నీవుమాత్రం ఇంట్లో జాగ్రత్తగావుండు. అమ్మాయినిఎండకు బయటకు తిరుగనిచ్చేవు. పొద్దుగూకులు మోటార్లు–రిక్షాలు–సైకిళ్లు తిరుగుతుంటాయి.

అదిగాక ఈ సంవత్సరం ఎండలు విపరీతముగా కాస్తున్నాయి, పిల్లను జాగర్తగా వుంచు. వడదెబ్బకు జ్వరాలు వస్తాయి తెలిసిందా?" అని బయలుదేరాడు.

అతను నాంపల్లిస్టేషను చేరుకునే టప్పటికి, నాలుగు గంటలు టయాం అయింది. బుక్కింగు ఆఫీసుకు వెళ్ళి రెండవ తరగతి టిక్కెట్టు కొన్నాడు. వెయిటింగురూములో కి పోయి కూరుచున్నాడు. 'ఇవాళ బండి గంటన్నర ఆలస్యమండి' అన్నాడు కూలివాడు.

'ఎందుకూ?' అని అడిగాడు శేఖరం.

'ఎవరో టెలిఫోను తీగలు తెంపేశారట.'

అయితే 'చచ్చామురా భగవంతుడా!', అనుకున్నాడు. కాసేపు కూచోగానే విసుకుపుట్టింది శేఖరానికి. అదిగాక వుక్కగ, కూడ ఉండటంచేత, ప్లాటుఫారముమీదనన్నా కాస్త విశ్రాంతిగా తిరుగుదామని బయటకువచ్చాడు. అటు యిటు పచారుచేస్తున్నాడు. కాసేపు మాట్లాడుకుందామన్నా తెలిసినవాళ్లెవరు కనిపించలేదు. ఎంతసేపటికి టయిం గడవటంలేదు. నిమిషం ఒక యుగంలా ఉన్నది 'తండ్రిగారు ఉత్తరం ఎందుకు వ్రాశారు?' అని ఆలోచిస్తున్నాడు. కారణం తోచలేదు. 'తల్లికి జబ్బుగా ఉందేమోనని, చెల్లెలికి

సంబంధం ఏమైనా వచ్చిందేమో?'నని అనుకున్నాడు. ఆదే దయినా ఉంటే 'తండ్రిగారు ఉత్తరములో వ్రాయకపో తా రా?' అనుకున్నాడు. చేతిగడియారం చూస్తూ అటుయిటు తిరుగుతున్నాడు.

ప్లాటుఫారం అంతజనంతో కిటకిట లాడిపోతుంది. స్త్రీలు, పురుషులు, బాలురు, బాలికలు రైలురాకకు ఎంతో ఆత్రంగా ఎదురుచూస్తున్నారు, రకరకాలమాటలతో, అరుపులతో, కేకలతో, స్టేషనంత ఎంతో కోలాహలంగా వుంది.

కొందరు 'పాను-బీడి-సిగరేటు' అని, యింక కొందరు 'చాయ- కాఫీ- బిస్కట్టు' అని; వేరొక కొందరు 'ద్రాక్ష ఆరంజి' అని; మరికొందరు 'గోలుకొండ- ఆంధ్రపత్రిక-ప్రభ' అని అరుస్తున్నారు. అంతలో రైలువచ్చింది. శేఖరం బండి ఎక్కాడు. కూలివాడు సామాను తెచ్చి పక్కనపెట్టాడు.

పడమర ఆకాశం పేస్తూవుండటంచేత, వెచ్చని వడ గాడుపు వస్తూంది అందువల్ల శేఖరం విద్యుత్పంఖా 'స్విచ్చి' వత్తాడు. అది 'బొంయి' మని తిరుగుతోంది కిటికీలో తల పెట్టి అవతలకి చూస్తూఉన్నాడు. అంతలో గంట గణగణ మ్రోగింది. రైలుకూసింది. గార్డు విజిలు ఊది, పచ్చజండా ఊపాడు. రైలు భయంకరంగా అరుస్తూ బయలుదేరింది.

అప్పటికి చీకటిపడిపోయింది. పట్నమంత రంగురంగుల దీపాలతో, ఎంతో అందంగా కనుపడతోంది. ఎత్తయిన చెట్లమధ్య నుంచి తెల్లగా కనుపించే మేడలు- తోటలు- ఫలవృక్షాలు ఎంతో అందంగా కనుపడుతున్నాయి.

మామిడిచెట్ల కొమ్మలలో నుంచి, 'కోయిల'కూతలు వినిపిస్తూన్నాయి. అవి ఎంతో మనోహరంగా వుండటంచేత, శేఖరం వింటున్నాడు. హుస్సేనుసాగరు- దాని పరిసర ప్రాంతాలు ఆ చీకట్లో ఎంతో అందంగా కనపడుతున్నాయి.

అంత పెద్దపెట్టెలో శేఖరం ఒక్కడే ఉండటంచేత, రాత్రింతా ఏవిధంగా గడపాలో తోచక భయపడుతున్నాడు. 'సికిందరాబాదు స్టేషనులోనన్ను ఎవరో ఒకరు కలవకపోతారా?' అనుకున్నాడు.

శేఖరం ఉస్మానియా పట్టభద్రుడు బేంకులో హెడ్ క్లర్కుగా పనిచేస్తున్నాడు. అతనికి ఇరువదిఏడు సంవత్సరముల వయస్సు. ఎత్తు పొడుగు, దానికి తగిన లావు చూచే వారికి ఎంతో ఆకర్షనీయంగా ఉంటాడు. మంచి కండపుష్టి- దేహారోగ్యం గలవాడు. ముఖం ఎంతో సంతోషంగా, కళకళలాడుతూ వుంటుంది. శేఖరానిది కష్టపడి పనిచేసే

స్వభావం. అబద్ధాలు- అక్రమాలు గిట్టవు. కనుక ఆతడు పనిచేసే బేంకులో అతడ్ని ఎంతో గౌరవంగా చూస్తూ ఉంటారు అందరు.

శేఖరానికి తెలుగు సారస్వతం అంటే ఎంతో ప్రేమ. అభిమానము. ప్రఫుల్లకు సంస్కృతాంధ్రాలు రెంటిపైన ఎంతో మక్కువ. ఆ యిద్దరు ప్రతినిత్యం అనేక సారస్వత విషయాలను గురించి చర్చించుకుంటూరు. వాదోపవాదాలు జరుగుతూ వుంటవి చివరకు యిద్దరు ఏకాభిప్రాయానికి వస్తూవుంటారు 'చిలుక- గోరువంకలవలె' ఆ యిద్దరు దంపతులు ఎంతో ఆనందంగా సంసారం వెళ్ళతీసుకుంటున్నారు. శేఖరం చిన్నతనములో ఎంతో కష్టపడి చదువుకున్నాడు. అందువల్ల బీద విద్యార్థులయందు అతనికి ఎంతో ప్రేమ. ఎప్పుడూ అతనికి తోచిన సహాయం చేస్తూవుంటాడు.

శేఖరానికి ముగ్గురుచెల్లెళ్లు. ఇద్దరికి పెళ్లిళ్లుజరిగాయి. వారు అత్తవారి యిండ్లల్లో కులాసాగా కాలక్షేపం చేస్తున్నారు. ఇంక ఒక చెల్లెలుకు పెళ్ళి జరుగలేదు.

తన చిన్నతనంలో తిండికి జరుగక ఎంతో బాధ పడుతూ వుండటం శేఖరానికి తెలుసు. అందువల్ల తల్లిని, తండ్రిని 'తనదగ్గిరే వచ్చివుండమని' ఎంతో బ్రతిమాలాడు.

నేను సంపాదిస్తున్న రోజుల్లోగూడ మీరు ఈవిధంగా ఈ పల్లెకొంపలో ఉండి నానాబాధలుపడుతూ వుండడము దేనికి నాయన' అనిగూడా చెప్పాను కాని వారు 'అబ్బ స్త్రీలో మేముండలేమురా! బాబు' అన్నారు. నేనుండగ మీకేం ఫరవాలేదు రాండి నాన్న' అన్నాడు శేఖరం. 'మేము అక్కడికిరాం నాయన. మా యిద్దరి ప్రాణాలు ఈగడ్డన పోవాల్సిందే. నీవు మధ్యమధ్యవచ్చి చూచిపోతూవుండు' అన్నారు. అందువల్ల శేఖరం గత్యంతరంలేక ఊరుకున్నాడు. కాని అతని మనస్సులో మాత్రం ఎంతో బాధగ వుంది, తల్లిదండ్రులనుగురించి. 'ఆ విషయాలే' ఆలోచించుకుంటున్నాడు. అంతలో సికింద్రాబాదు స్టేషనువచ్చింది. కాఫీ దాగివద్దామని బయలుదేరాడు. స్టేషనంత తిరిగి, రైలు బయలుదేరుతూ వుండగ తిరిగివచ్చాడు. 'తన ఎదురుగా ఉన్నసీటులో ఎవరో స్త్రీ కూరుచోని ఉండటం చూచాడు. ఆమె, ఆ లైటు వెలుగులో ఎంతో అందంగా కనిపించింది 'ఫరవాలేదు ఏదో తోడు దొరికింది ఒక్కడిన్ని కాకుండ' అని అనుకున్నాడు. "ఎక్కడికి పోతున్నారు?" అని అడుగుదామనుకున్నాడు. వరాయి ఆడదాన్ని ఆవిధంగ 'అడిగితే బాగుంటుందో బావుండదో' అనుకున్నాడు. కాని ఆమెను తాను పూర్వం ఎక్కడో' చూచినట్లు అనిపించింది. 'ఎక్కడా?' అని ఆలోచించాడు, "ఎక్కడో" తోచలేదు.

కిటికీలో తలపెట్టి అవతలికిచూస్తూ 'ఎక్కడచూచావా?' అని ఆలోచించాడు. రైలు పొగ వాసన విపరీతంగా వస్తూంది. నిప్పురవ్వలు గాలికి ఎగిరి కండ్లల్లోపడుతున్నాయి అందువల్ల తల మళ్ళీ లోపలికి తీసుకున్నాడు. తన ఎదురుగా చంద్రబింబంలా మెరిసిపోయె స్త్రీని మళ్ళీ చూచాడు ఆమెకు యిరువైఅయిదో లేక యిరువైఆరో సంవత్సరాలు ఉండవచ్చు ననుకున్నాడు. ఏమితోచక సంచితీశాడు. పత్రిక ఏమైన దొరుకుతుందేమోనని, కాని ఏ పత్రిక దొరకలేదు. అడివి బాపిరాజుగారి 'నారాయణరావు' దొరికింది. దాని చదువుదామని తెరచాడు. తియ్యటంతోటే 'మానవుడి హృదయం విశాలం కావాలంటే, దేశాటనంచేయటం చాల ముఖ్యం' అని వున్నచోట తాను 'ఎట్టిసీరాతో' అండరులైను చేసినది గనుపించింది. దాన్ని చదువుకున్నాడు. 'నిజమే దేశాటనం చాలాఅవసరం. 'కూపస్తమండూకాల్లా ఒకేచోట ఉంటే విజ్ఞానం ఏమి అభివృద్ధి అవుతుంది?' అనుకున్నాడు తరువాత బాపిరాజుగారి భాష. భావాలు, రచనాపద్ధతి. శిల్పకళ మీాద వారికున్న అభిమానం మొదలైన వాటినిగురించి ఆలోచించాడు. అవన్నీ ఆతనికెంతో ఆనందం కలుగజేశాయి.

అంతలో ప్రఫుల్ల తనతో ప్రతినిత్యం అనేమాటలు

గుర్తువచ్చాయి, 'నాకు విశ్వనాథవారి నవలలు ఎంతో బావుంటాయి చదవటానికి' అని అంటూ ఉండటం.

'లోకోభిన్నరుచి' అన్నారు పెద్దలు. 'కనుక ఎవరి అభిరుచులు వారివి' అని సమాధానం చెప్పుకున్నాడు. పుస్తకం మళ్లీ చదవటం ప్రారంభించాడు. అచ్చు సన్నగ ఉండటంచేత సాగలేదు. తలఎత్తి చూస్తూవున్నాడు

శేఖరానికి ఎదురుగా ఉన్న ఆమె పడుకోవడానికి వీలుగా ఉండేటట్టు బెడ్డింగును సరిగ్గా సర్దుకుంటూ ఉంది.

ఆమె నల్లని పొడగాంటి శిరోజాల్లో ఉన్న మల్లెపూల వాసనలు అతన్ని ముగ్ధుణ్ని చేస్తున్నాయి. ఆమెవైపే చూస్తున్నాడు. అతను. ఆమె బంగారు వన్నె శరీరకాంతులు, తళతళ మెరిసిపోతున్నాయి. ఆమెచేతికి ఉన్న బంగారుగాజులు, ఆమె శరీర సౌందర్యానికి సాటిరాలేక పోతున్నాయి. ఆమె ముఖంవైపు చూచాడు. అందమైన వాలుకండ్లు-పొడగాంటి కోనైన ముక్కు- శంఖాలవంటి చెవులు విశాలఫాల భాగం వాటిపైన రెపరెపలాడె చిన్నముంగురులు, ఎంతో అందంగ కనుపించాయి. 'ఎవరో కలవారి యింటి స్త్రీ' అనుకున్నాడు, మళ్ళీ ఆమెవైపు చూచాడు. ఆమె కుడిముంచేతిపైన 'నల్లగ కాని వెడల్పు పుట్టుమచ్చ' కనుపించింది.

ఆ పుట్టుమచ్చను చూచేటప్పటికి దేవప్రియగుర్తు వచ్చింది, 'దేవప్రియేనేమో' ననుకున్నాడు. కాని 'మనిషిని పోలిన మనిషి వుండటం సహజం' అని భావించాడు.

దేవప్రియ పేరు తలచుకొనేప్పటికి చిన్ననాటి సంగతులన్నీ గుర్తురాసాగాయి. అతని కళ్లల్లో నీరుతిరిగింది ఆమె చూస్తూందేమోనని, తన తల కిటికీ వైపు తిప్పుకున్నాడు.

శేఖరం చిన్నతనంలో వాళ్ల మేనమామగారి ఊళ్లో ఉండేవాడు. దేవప్రియ శేఖరం మేనమామగారి యింటి ప్రక్కన ఉండే సుబ్రహ్మణ్యంగారి కూతురు. వారు చాల భాగ్యవంతులు. ఆ వూళ్లో చాలా పలుకుబడి కలవారు. శేఖరం మేనమామగారి పేరు కాశీ రామయ్యగారు. ఆయన గారు ఆవూరి పురోహితుడు. ఆయనకు పిల్లలులేకపోవడం చేత, శేఖరాన్ని తన దగ్గరే ఉంచుకున్నాడు. అదిగాక ఆ రోజుల్లో శేఖరం తండ్రి విశ్వపతిశాస్త్రిగారి పరిస్థితి ఎంతో ఇడ్డగావుండేది. కాశీ రామయ్యగారికి సుబ్రహ్మణ్యంగారికి ఎంతో స్నేహం. యిద్దరు ఒకే శాఖవారు. కాస్త దూరపు బంధువులు. అందువల్ల ఎంతో అన్యోన్యంగా వుండేవారు. అందువల్ల దేవప్రియ, శేఖరం యిద్దరుకూడ ఎంతో స్నేహంగా కలిసి మెలిసి వుండేవారు. కలిసి ఆడుకునేవారు.

చదువుకునేవారు. తిరిగేవారు. అప్పటికి శేఖరానికి పద మూడు సంవత్సరాల వయస్సు. దేవప్రియకు పన్నెండు సంవత్సరాలు.

సుబ్రహ్మణ్యంగారి చేలు ఆవూరికి దగ్గరలోవుండేవి. ఇద్దరు పిల్లలు పోయి ఆ చేలల్లో పెసరకాయలు, దోసకాయలు, సజ్జకంకులు తెచ్చుకొని వాటితో ఆడుకొనేవారు. దేవప్రియ తల్లి కామాక్షమ్మగారు. ఆ యిద్దరు పిల్లల ఆటలు చూచి ఎంతో సంతోషించేది. నవ్వుతూ శేఖరం, మామగారితో, 'మా దేవప్రియను శేఖరానికి యిస్తాం చేసుకోండి' అని అంటూ ఉండేది. వారు 'మావంటి బీదవారికి మీ పిల్లను యిస్తారా! ఏ మహారాజుకో యిస్తారు'. అని అంటూ ఉండేవాడు. ఇంతకన్న గొప్ప సంబంధం తెస్తామూలే అంటూవుండేది ఆమె. క్రమంగా దేవప్రియ శేఖరం ఒకర్ని ఒకరు ఎంతో ప్రేమించుకున్నారు. అవూళ్ళో వారు ఎవరన్నా నవ్వుతూ 'దేవప్రియ శేఖరం భార్య అంటూవుండేవారు'. "ఆమె ఏడ్చేది". శేఖరం ఓదారుస్తువుండేవాడు.

ఆ యిద్దరు బాల్యమంతా ఆవిధంగ గడిపారు. తరువాత శేఖరం బస్తీ చదువుకు పోయాడు. కొంత కాలానికి దేవప్రియ వివాహం చేయాలని తండ్రి నిశ్చయించుకొని,

కాశీ రామయ్యగారితో 'సంబంధం ఎక్కడున్నవుంటే' చూడ మన్నారు. ఆయనగారు 'మా శేఖరానికివ్వండి, బస్తీలల్లో చదువుతున్నాడు.' అన్నాడు. కానివారు యిష్టపడలేదు. ఆమె వివాహం జరిగిపోయింది. తరువాత కొంతకాలానికి కాశీ రామయ్యగారు చనిపోయారు. ఇక శేఖరానికి ఆవూరు పోవలసిన అవసరమే తీరిపోయింది.

దేవప్రియ అందచందాలు శేఖరం హృదయంలో హత్తుకపోయాయి. ముఖ్యంగా ఆమె 'వాళ్ళ మిరపచేలో తన మెడలోవేసిన పూలదండను, అప్పుడు తనవైపుచూచిన చూపులను మాత్రం' మరచిపోలేదు. అవన్నీ మళ్ళీతలంపుకు వచ్చేటప్పటికి అతని హృదయం ఎంతోబాధపడింది. కండ్లవెంట నీరు కారడం ప్రారంభించింది. బస్తీలో తిరుగుచు న్నాడు. మరల లోపలికి చూచాడు.

ఆ నల్లని పుట్టుమచ్చ ఆ దీపపుకాంతిలో అలాగే మెరిసిపోతోంది. చిన్నతనంలో దేవప్రియ పుట్టుమచ్చను తాను ఎప్పుడూ ముద్దుపెట్టుకోవటం, ఆమె 'నీకు ఎప్పుడు యిదేపనా?' అంటూ ఉండటం గుర్తువచ్చింది ఆఘట్టాలన్నీ తలంపుకు వచ్చేటప్పటికి, అతని హృదయం ఆనందంతో ఉప్పొంగి పోయింది.

మళ్ళీ పుట్టుమచ్చవైపు చూచాడు.

సందేహం లేదు. 'దేవప్రియే' అని నిశ్చయించుకున్నాడు. పదిహేను సంవత్సరాల క్రితం జరిగిపోయిన చరిత్ర, అందులో చిన్ననాటి చరిత్ర గుర్తువచ్చేప్పటికి అతని హృదయం ఎంతో కలవరపడ జొచ్చినది. ఆ రోజుల్లో దేవప్రియ సన్నగా పొడుగ్గా ఉండేది. ఎఱ్ఱటి పరికిణీ, పచ్చటి జాకిటు తొడుక్కునేది. నల్లని వెంట్రుకలు, అందమైనకళ్లు, బాలుగా రే బుగ్గలు, ఎంతో నవ్వుతూవుండేది. 'ఆ పోలికలన్నీ ఈమెలో ఉన్నాయి. సందేహం లేదు. దేవప్రియే' అను కున్నాడు.

"ఎక్కడిదాకనండీ! ప్రయాణం?" అని అడిగాడు.

"రామాపురం వెళ్ళుతున్నాను. మా నాన్నగారికి జబ్బుగావుంది. వెంటనే రమ్మని వుత్తరం వ్రాశారు." అని మరల, "తమరు ఎంతవరకూ?" అని అడిగింది.

నేను రంగాపురం వెళ్లుతున్నాను. కాని "మీనాయన గారి పేరేమిటి?"

"సుబ్రహ్మణ్యంగారండీ!"

"ఏ పేరు?"

"దేవప్రియ"

"ఓ! నువ్వేనా దేవప్రియా!"

"నీనా! శేఖరం!!"

"నేనే ఇందాకటినుంచి చూస్తూ వున్నాను. నీవు అవునో కాదో" నని.

"ఎంతకాలానికి కలశావు శేఖర్? నూటుబూటులో వుంటే గుర్తుపట్టలేక పోయాను. క్షమించు శేఖరం" అంది, మరల "ఇంకా అక్కడే కూర్చున్నావేం నా దగ్గరికి రా; నన్ను పరాయిదాన్ని చేశావా?" అని అన్నది.

శేఖరం వెళ్ళటానికి సందేహించాడు.

"ఇలావచ్చి నా దగ్గర కూచో శేఖర్" అంటూ ఆమె అతని చెయిపట్టుకొని తనదగ్గర కూచోబెట్టుకుంది.

శేఖరం ఆనంద సముద్రములో మునిగి తేలుతున్నాడు తన అదృష్టానికి తానే మురిసిపోతున్నాడు. 'కలకాదు గదా!' అనుకున్నాడు అంతలో దేవప్రియ తన సంచిలో ఉన్న 'ఫ్లాసుకు' తీసి కాఫీ గ్లాసులోపోసి "తాగు శేఖరం" అని నోటికి అందించింది.

"ఇప్పుడే తాగాను వద్దులే"

“అలాకాదు తాగు” అంది. అతను తాగాడు.

మళ్ళీ పుట్టుమచ్చ కనుపించింది. దానిమీద చేయివేసి శేఖరం నిమిరాడు.

“ఎన్నాళ్ళకు కలుసుకున్నాం శేఖర్?” అంది దీనంగా దేవప్రియ।

“నిజమే! ఎంతో కాలమైపోయింది”

“అబ్బ ఎంత అదృష్టవంతులం శేఖర్! మనం!”

“ఔను!”

“శేఖర్ నీ కోసమని ఎంత బాధపడ్డా ననుకున్నావు. ఎన్ని వుపవాసాలు చేశానను కున్నావు. ఆ సంగతులన్ని తలచుకుంటే నా గుండె పగిలిపోతుంది. నా పెళ్ళిలగ్నం పెట్టారు, ‘ఆ సంబంధం నేను చేసుకోను’ అని చెప్పాను. ‘శేఖరాన్ని తప్ప యింకొకరిని చేసుకునేది లేదు’ అన్నాను. మా అమ్మ నాన్నా ఎంతో కోప్పడ్డారు. “ఆ దరిద్రుడ్ని చేసుకొని ఏం సుఖపడతావు? నీకు ముష్టిఎత్తుకోవాలని వుందా?” అని అడిగారు. మీ మామయ్యగారే, ‘నాకు యిదంతా నేర్పారని’ ఆయన్ను తిట్టారు, కొట్టబోయారు. ఆయనగారు ‘నాకేమి తెలియదు బాబు!’ అని ఎంతో చెప్పాడు. ‘ఇదంతా నీవుగాక యింకెవరు చేస్తున్నారు? అంతా నీవే నేర్పావు.’ అనిమా

నాన్న అడ్డమైన మాటలు అన్నాడు. "మానాన్నగారికోపం నీకు తెలుసుకదా?"

"ఆ"

"దాంతరువాత నేను ఒకనాడు కృష్ణలోపడి చచ్చిపో దామని, పోయినాను. మీమామయ్యగారు అక్కడేవున్నారు. 'ఏంతల్లీ! నీమూలంగా నాకొంప ముంచుతావా! నామాట విను. మీనాన్నగారు తెచ్చిన సంబంధంచేసుకో, వారు చాల భాగ్యవంతులు. పట్నంలో సుఖంగా వుండవచ్చు. శేఖరం దరిద్రుడు. వాడివల్ల నీకేం సుఖంచెప్పూ?" అన్నాడు.

"బాబాయిగారూ! మీరుకూడ శేఖరం దరిద్రుడనే అంటున్నారా?" అన్నాను ఏడుస్తూ.

"కాదమ్మా నామాటవిను. నీకడుపున పుడతాను." అన్నాడు ఎంతో బతిమాలుతు.

"నేను ఏంచేసిన మీమామయ్యగారిని వృధాగా బాధపెడతారు. అందువల్ల మాట్లాడకుండ ఇంటికి వెళ్ళిపో యాను. తరువాత పెండ్లి జరిగిపోయింది. పెండ్లిలో నేను సంతోషంగావుండలేదు. నన్ను నలుగురు నాలుగు మాటల న్నారు. ఎవరిని నేను లెక్కచెయ్యలేదు. మాట్లాడకుండ వూరుకున్నాను. ఆనాటినుంచీ 'నీచిన్ననాటి రూపాన్ని మన

న్నలో పెట్టుకొని పూజిస్తున్నాను ఎన్నటికైన కలవక పోతావా?' అనుకున్నాను. ఆ ఆశతోనే జీవిస్తున్నాను. మా తల్లిదండ్రులు నాజీవితాన్ని నాశనంచేశారు. నా బ్రతుకంతా 'అడవికికాసిన వెన్నెలయిపోయింది. నాకు ఈ ప్రపంచంపైన రోతపుట్టింది" అని ఏడుస్తూ చెప్పింది.

శేఖరం దేవప్రియచేయి తన చేతిలోకి తీసుకున్నాడు అతనిచేయి వణికి పోతోంది. ఆ పుట్టుమచ్చను ముద్దుపెట్టు కున్నాడు. అతనికెంతో ఆనందం కలిగింది ఆచేయిని తన హృదయానికి ఆనించుకున్నాడు. ఎంతో సంతోషం కలిగింది. తృప్తి కలిగింది. / ఏవో దివ్య లోకాల్లో విహరిస్తు వున్నట్లు తోచింది.

"ఇప్పుడు యెంత పెద్దవాడవయ్యావు శేఖర్! ఎంత ఎత్తు పెరిగావు మనం చిన్నతనంలో ఎంతకులాసగా ఆడు కున్నామో జ్ఞాపకముందా? 'నీవు నా భార్యవు' అని చెప్తూ మా పెరటిలో 'నాకు బంతి పూలదండ వేశావు' గుర్తుందో?"

"ఆ"

"నేను ఏడిచాను. నీవు సముదాయించావు. మళ్లీ దండ వెయ్యమన్నావు. నేను వెయ్యలేదు నీవు నన్ను కోప్పడ్డావు. నేను కిలకిలనవ్వుతూ దండవేశాను. తరువాత యిద్దరం, ఒకరి

చెయ్యి ఒకరంపట్టుకొని కృష్ణానది దగ్గరికి వెళ్ళేవాళ్ళం తెలుసా?"

"నిజమే"

"నీవు ఏటిలో పడ్డావు. ఈతకొట్టావు. నదిలో నురుగంతా నా ముఖంనిండ చల్లావు. ఏటిలో బురదనీరంతా నాశరీరం నిండపోశావు? నేను ఏడ్చాను. మా మామయ్యతో చెప్తా నని బెదిరించాను. నీవు నా గడ్డంపట్టుకొని బతిమా లావు జ్ఞాపకముందా?"

"ఉంది"

"తంగేడిపూలు– కట్లపూలు– తెలుగండిపూలు తెచ్చి నాతల్లో తురిమావు. ఎవ్వరికి చెప్పవద్దని బతిమాలావు. జ్ఞాపకం రావటంలా?"

"ఔను"

"నీవు చదువుకోలేదు. అల్లరిపిల్లలతో కృష్ణానది వెంట కొండల్లో అడవుల్లో తిరుగుతూవుండేవాడివి. మన చలమయ్య మాష్టారు నిన్ను కొట్టారు. నీకు కోపంవచ్చి కృష్ణానదిలో పడతానన్నావు. నేను వద్దని బతిమాలాను. కోపంతో నీవు ఆ ఇసుకతిన్నెలమీద ఇసుకంతా నానెత్తినపోశావు. కాదూ!"

"పోశాను."

"తప్పు క్షమించుదేవా– నీకాళ్లు పట్టుకుంటాను," అని చెప్పావు. నేను ఏడుస్తూవుంటే.

"నిజమే" అని, మరల" ఆ సంగతులు అన్నీ యింక జ్ఞాపకమున్నాయే ?" అన్నాడు.

"ఆ రోజులన్నీ- నా జీవితంలో మరచిపోతానా! శేఖర్ !"

"ఆ రోజులు ఎంతో మంచివి దేవా!"

"కనుకనే భారతకారుడు ఏమన్నాడో తెలుసా?"

"ఏమన్నాడు?"

"గతకాలము మేలు-వచ్చుకాలము కంటెన్" అని

"ఎంత తెలివి గలవాడివయ్యావు దేవా! భారతం కూడ చదివినట్టుందే!"

"భారతంవంటి పవిత్ర గ్రంథం చదువకుండ వుంటావా ?" అని, మరల "ఓనాడు మనం కృష్ణానది నిండుగ రెండు గట్లు తెగేట్టు ప్రవహిస్తూ వుంటే, చాలా రాత్రిదాక వెన్నెల్లో కృష్ణమ్మతల్లి మధుర గీతాలను ఆలాపిస్తూ కూర్చున్నాం. అంతలో మా నాన్నవాళ్లు మనల్ను వెతుకుతూ వచ్చారు. కొప్పడ్డారు. గుర్తు వస్తుందా ?"

"అవును గుర్తువుంది."

"నీవు ప్రతినిత్యం మన వూరిదగ్గర ఉన్న పాడుపడ్డ దేవాలయానికి పోయేవాడివి. అక్కడవున్న రాతి విగ్రహాల

ను చూస్తూవుండే వాడివి. అంతలో నేను వచ్చేదాన్ని. నన్ను చూచి ఆ గుడిమంటప మెక్కేవాడివి, నేను కిందికి రమ్మని బతిమాలేదాన్ని, నీవు రాను అంటూ వుండేవాడివి. నేను కోపంతో వెళ్ళిపోతు వుండేదాన్ని. వెనకనుంచి వచ్చి నా బుజాలు పట్టుకునేవాడివి. నన్ను ఆ గుళ్ళోకి తీసుకపోయే వాడివి. అక్కడవున్న రాతి బొమ్మలన్ని చూపేవాడివి. అందులో సీతారామ లక్ష్మణులు తల్లిదండ్రులను వదలి అరణ్యానికి పోతూవున్న దృశ్యాన్ని చూచి ఎంతో జాలిపడుతూ వుండేవాన్ని. గుర్తు లేదూ?"

"వుంది" కాని "మీ ఆయనగారు ఏంచేస్తూవుంటారో? చెప్పవేం?" అన్నాడు శేఖర్.

"దొరలు ఏంచేస్తారు. తింటారు. కార్లమీద తిరుగుతారు."

"ఏం ఉద్యోగం చెయ్యటంలా?"

"వారికి ఏ ఉద్యోగం చేయాల్సిన అవసరంలేదు. కావల్సినంత ఆస్తివుంది."

"ఇంకేం హాయిగా సుఖపడుతోండవచ్చు."

"నీవు ఆ మాటే అంటున్నారా శేఖర్? ధనంతో జీవితానికి ఆనందం కలుగుతుందా? సంతోషం లభిస్తుందా?

ప్రేమ అవసరంలేదూ? మేడలు— మిద్దెలు— చీరలు-నగలు- ధనముంటే సరిపోతుందా? ప్రేమ అవసరంలా! కలితండ్రి ఏ ముద్దుకో బలవంతాన పుస్తెకట్టించి, వీడే నీభర్త అంటే సరిపోయిందా? ప్రేమ వుండొద్దూ! అంది దీనంగ "

శేఖరానికి దేవప్రియ మాటలు వింటుంటే ఎంతో ఆశ్చర్యం కల్గింది.

"నిజమే— ప్రేమకు ధనానికి సంబంధం ఎక్కడ" అనుకున్నాడు శేఖర్!

"ధనవంతు ఆస్తి వుందని నన్ను ఆదుర్మార్గుడికి కట్టబెట్టారు, అమ్మానాన్నగార్లు. కాని నా హృదయాన్ని అతని వశం చేయగలరా?

నీవంటివుత్తమునికి, భార్యను కాకుండ చేశారేగాని, వేరె ఏమిచేయగలరు? ఇంతకాలంనుంచి నాజీవితమంత నాశనమైపోయింది కోరికలన్నీ నశించిపోయాయి, హృదయం మోడువారిపోయింది. యౌవనమంత మంటకలిసి పోయింది. ఏదో బ్రతుకుతున్నాను" అంది కంటతడిపెడుతూ, అతను ఆమె దుఃఖాన్ని చూడలేకపోయాడు. ఆమెను తన రెండు చేతుల్లోకి తీసుకున్నాడు! తనహృదయానికి హత్తుకున్నాడు. ఆమె పసిపిల్లలా అతని కౌగిట్లో కండ్లు మూసింది.

"దేవప్రియ నా సామ్రాజ్ఞి ఆమెపైన సర్వాధికారాలు నావి. ఆమె నా జీవితంలో భాగం. అసలు ఆమే-నేను, నేనే-ఆమె. మా శరీరాలు మాత్రమే వేరు మా ఆత్మలు రెండు ఒక్కటే. భేదం లేదు. ఆత్మ నిత్యమైంది. శాశ్వతమైంది. యుగయుగాలు నిలచివుండేది అలాగే మా ప్రేమకూడ..." అని అనుకొన్నాడు. 'అతని కౌగిటిలో ఆమె స్వర్గసుఖాలు అనుభవిస్తూంది. ఏవో దివ్యలోకాల్లో రాజహంసలాగ, విహారిస్తూవున్నట్లు భావించింది.' శేఖరం ఆమెను తన కౌగిలి నుంచివదిలాడు. కాని ఆమెకండ్లు మూసుకొనేవుంది. స్పృహ లేదు, ఆమెను సీటుమీద పడుకోబెట్టాడు. తన దస్తీ తడిపి ఆమెముఖం తుడిచాడు. ఆమె కండ్లు తెరిచింది. ఆ తని ప్రాణాలు కుదుటబడ్డాయి. "అమ్మయ్యా...!" అని నిట్టూర్చాడు.

ఆమెవైపు అలాగే చూస్తూన్నాడు. ఆమె చంద్రబింబంవంటి ముఖం తళతళ మెరిసిపోతోంది. ఆమె అందమైన కనుబొమలమధ్యన వున్న తిలకం- దొండపండువంటి ఎర్రని పెదవులు ఒకదాన్నొకటి వెక్కిరిస్తున్నట్టు తోచింది. ఆమె చిన్నముంగురులు చల్లనిగాలికి నాట్యం చేస్తున్నాయి నుదిటిపైన.

శేఖరం తల కిటికీలోకి తిప్పుకున్నాడు. [illegible]

క్షీణచంద్రుడు తూర్పువైపు అప్పుడే పుదయిస్తున్నాడు. భార్య ప్రఫుల్ల తామరపుష్పంలా విప్పారిన ముఖంతో, కండ్లల్లో మెరిసింది. "యింతకాలమునుంచి తనను దైవంగ పూజిస్తూ, శ్రద్ధతో జీవితయాత్ర సాగిస్తూవున్న ఆమెను తాను 'ఎంతో అపచారం చేశా' ననుకున్నాడు. ఆమెతో తనకు జరిగిన వివాహం, ఆమె ధరించిన పట్టుబట్టలు- కళ్యాణపుబొట్టు, కాళ్ళపారాణి వరుసగ గుర్తువచ్చాయి.

వివాహంలో బ్రాహ్మణులు చదివిన మంత్రాలు, అగ్నిసాక్షిగ తాను సూత్రధారణచేస్తూ చేసిన ప్రమాణం- అప్పగింతలు క్రమంగా జ్ఞాపకం వచ్చాయి. అవన్నీ గుర్తు వచ్చే అప్పటికి అతని హృదయం ఎంతో బాధపడ్డది. కండ్ల వెంట నీరు తిరిగింది. "దేవప్రియ పరాయిస్త్రీ- వివాహిత- కనుక ఆమెతో తన సంబంధం తప్పు" అనుకున్నాడు.

"కాదు దేవప్రియ నీ సొమ్మే ఆమె నీ హృదయం లో హృదయం. ఆత్మలో ఆత్మ- ప్రాణంలో ప్రాణం. ఆమెకు నీకు భేదంలేదు. మీ శరీరాలే వేరు. మీ యిద్దరికి వాళ్ళు మెరవచేలోనే, బంతిపూల దండలతో వివాహం జరిగింది, అదే పవిత్రమైన వివాహం. నిజమైన వివాహం" అని ఎవరో తనకు ప్రబోధము చేస్తువున్నట్లు తోచింది. తనచుట్టు

చూశాడు. దేవప్రియ కండ్లుమూసుకొనే వుంది. రైలు అలుపులేకుండ పరుగెత్తుతోంది.

తన తల లోపలికి తీసుకున్నాడు. మళ్ళీ ప్రఫుల్ల కాంతవదనంతో కండ్లల్లో మెరిసింది. తాను బయలుదేరుతూ వున్నప్పుడు "భద్రమండి రైలుప్రయాణం" అంటూ సాగనంపిన దృశ్యం గుర్తువచ్చేప్పటికి ఆతని హృదయం, ఎంతో కల్లోలపడసాగింది.

"దేవప్రియా?" అని అప్రయత్నంగ పిలచాడు.

"ఏం శేఖరం పిలిచావా?"

"అవును"

"ఎందుకూ?"

"నేను చేసినపని తప్పుకాదూ?"

"తప్పా! ఎవరంటారు?"

"సంఘం"

"ఈ కుళ్ళు సంఘమేనా?"

"ఔను"

"ఈ సంఘం, కొందరు స్వార్థమానవులచేత నిర్మించబడ్డది. దీన్నిచూచి భయపడాల్సిన పనిలేదు. మన ప్రేమ పవిత్రమైంది. మన ఈ పవిత్రప్రేమను తప్పు" అని చెప్పటానికి ఎవరికీ సంబంధంలేదు.

"నీ-నా దృష్టిలో కావచ్చు కాని భగవంతుడు మన ఈ సంబంధాన్ని మెచ్చుకుంటాడా!"

"భగవంతుడు దయామయుడు మనల్ని తప్పకుండ క్షమిస్తాడు. అతని దృష్టిలో అంతా సమానమే. ఈ ప్రపంచంలోని ప్రతి అణువుమీద ఆయనకెంతో ప్రేమ. నీకు ఆ భయం అవసరంలేదు. నేను నీదాన్ని-నీవు నావాడివి. తెలిసిందా!" అని అంది. అంతలో, మిన్ను విరిగి మీదపడ్డట్లు చప్పుడైంది.

శేఖరానికి తెలివివచ్చేటప్పటికి క్రిందపడివున్నాడు. ఎటుచూసినా రోదన ధ్వనులు వినబడ్డాయి. తన ప్రక్కన దేవప్రియ లేదు. అటు-ఇటు చూచాడు. ఆ పుట్టుమచ్చ మళ్ళీ కళ్ళల్లో మెరిసింది. "దేవా......!!!" అని పిలచాడు, సమాధానం రాలేదు లేచి వెదుకుదామనుకున్నాడు. శరీరం నిండ గాయాలు తగిలివున్నాయి. రక్తం ఎగజిమ్ముతోంది. దాన్ని చూచేటప్పటికి కండ్లు మూతపడ్డాయి.

మళ్ళీ కళ్ళు తెరచి చూచేటప్పటికి ఆసుపత్రిలో ఉన్నాడు. శరీరమంతా వున్న గాయాలకు కట్లుకట్టివున్నాయి. కండ్లు తెరిస్తే దేవప్రియ కనబడుతోంది. లేచి, ఆసుపత్రిలో వెతుకుదామనుకున్నాడు. కాని ఓపిక లేదు. ఎవరన్నా తెలిసినవారు కనపడితే అడుగుదామనుకున్నాడు. ఎవర్నీ అగుపించ

లేదు. మూడు రోజులవరకు మంచంలోనుండి లేవలేదు తరువాత క్రిమంగ విస్మరించింది

"గోలుకొండ–పత్రిక–ప్రభ" అంటూ పేపరు కుర్రవాడు వచ్చాడు. శేఖరం పత్రిక చూచాడు. పెద్ద హెడ్డింగుతో "ఖాజీపేట–డోర్నకల్లు జంక్షన్లమధ్య రైలుప్రమాదం. తొమ్మిదిమంది మరణం– పలువురికి గాయాలు చనిపోయిన వారిలో నాలుగుపేర్లు తెలిశాయి. మిగిలినవారిపేర్లు తెలియ లేదు. విచారణ జరుగుతోంది. రైలుపట్టాలు. ఎవరో ఊడ బీకటంవల్ల ఈసంఘటన సంభవించింది." అనివుంది.

శేఖరం నాలుగుపేర్లు చదివాడు. తనకు తెలిసినవారెవరు లేరు. మిగిలినవారిలో "దేవప్రియ లేదుకదా?" అనుకున్నాడు. 'అయ్యో!' ఈఆశ్లీలాలేమిటి?' అని అనుకున్నాడు. "దేవప్రియ వేయి సంవత్సరాలు బ్రతకాలి' లని ఆశీర్వదించాడు. అతను ప్రతిరోజు పత్రిక చదువుతున్నాడు. శరీరం పూర్తిగా నయమైపోయింది. ఒకనాడు 'పేపరు' అని అరుస్తూ కుర్రవాడు లోపలికివచ్చాడు. మామూలుగ శేఖరం పేపరు చూచాడు, 'అయిదవ తారీఖు రైలు సంఘటన పూర్తివివరాలు' అని వుంది, కుతూహలంతో చదవటం ప్రారంభించాడు, ఆరో పేరు దగ్గరికొచ్చేటప్పటికి చేతులో పేపరు క్రిందపడిపోయింది, "దేవా! నీకా! ఆ ఘోర దుర్మరణం. నేను

ఎంత దురదృష్టవంతుణ్ణి. మెరుపుతీగలా మెరిసి నానుంచి దూరమౌతూ, ఈ పాడులోకంలో నన్ను వదలిపోయావా!" అంటూ పడిపోయాడు.

మళ్ళీ అతనికి తెలివివచ్చే టప్పటికి పొద్దుపోకింది. తలంత దిమ్ముగ వుండటంచేత 'కాఫీ తీసుకరా' అని వార్డు బాయితో చెప్పాడు. వాడు "ఈ చీటి డాక్టరుగారు మీకు యివ్వమన్నారండి" అని యిచ్చి వెళ్లిపోయాడు. శేఖరం తెరచిచూచాడు. అందులో "మీరు రేపు వెళ్ళవచ్చు" నని వుంది.

"కాఫీ తాగండిసార్" అంటూ వార్డుబాయి తెచ్చి యిచ్చాడు. శేఖరం కప్పు చేతులో పట్టుకున్నాడు. దేవప్రియ రైలులో కాఫీ యిస్తూవున్న దృశ్యం గుర్తుకువచ్చింది. కళ్ళవెంట నీరు తిరిగింది. కాఫీ తాగుదామని నోటిలో పెట్టుకోబోయాడు. అందులో దేవప్రియ మెరిసింది "ఈ కాఫీ నీవే తాగు" అని వార్డుబాయికిచ్చాడు. ఇక అక్కడ వుండ బుద్ధిపుట్టలేదు. బయటికివచ్చాడు. శుక్లపక్ష పంచమీ చంద్రుడు పడమటివైపు ప్రకాశిస్తున్నాడు. ఆవైపేచూస్తూ నిలుచున్నాడు. రైలులో దేవప్రియతో తాను అనుభవించిన స్వర్గసుఖాలు జ్ఞప్తికి రాసాగాయి. ఆమె కౌగలింతలో పొందిన ఆనందం, తియ్యని మాటలవల్లకలిగిన తృప్తి తల

వుకువచ్చేటప్పటికి ప్రశ్నలతో తాను ఇంతకాలము నుంచి గడపిన జీవితమంత మిథ్యగతోచింది.

అంతలో శేఖరానికి, దేవప్రియ తెల్లని సిలుకుచీరతో, ఊదారంగు జాకెట్టుతో, చంద్రబింబంవంటి మోముతో తన ముందు నిలుచోని వున్నట్లు తోచింది. ఆమె 'నల్లని పుట్టుమచ్చ' కండ్లల్లో మెరిసింది. 'దేవా! మళ్ళీ నా దగ్గరికి వచ్చావా?' అని పెద్దగా పిలిచాడు. సమాధానం రాలేదు. ఆ ప్రశాంత వాతావరణంలో తన మాటలు మళ్ళీ ప్రతిధ్వనిస్తూ తన్నే వెక్కిరిస్తువున్నట్లు తోచింది అతని హృదయం తుఫానులో సముద్రంలాగా. ఆవేదనతో పొంగిపొరలింది. ఇక అక్కడ నిలుచోలేక పోయాడు. తన దురదృష్టానికి ఎంతో బాధపడుతూ, బరువైన హృదయంతో వెళ్ళిపోయాడు.

(ఆంధ్ర దినపత్రిక, 28-8-1953 లో, ప్రచురితము.)

---

# అవరోహణ.

ఆషాఢ శుద్ధ ఏకాదశి. సూర్యోదయం కాబోతోంది. కృష్ణానదినిండుగ రెండుగట్లు తెగేట్టు ప్రవహిస్తోంది. నీరంతా బురదగా వుంది.

రేవునిండా జనం కిటకిటలాడి పోతున్నారు. కట్టెలు కంపలు కొట్టుకొచ్చి, స్నానాలు చేస్తున్నవారికి అడ్డురానా గాయి. వాళ్లు వాటిని ప్రక్కకుతోసి, తమ కార్యక్రమాల్లో మునగసాగారు. బ్రాహ్మలు మంత్రాలు చదివి యాత్రికుల చేత స్నానాలు చేయిస్తున్నారు.

కృష్ణానదిలో, నురుగంతా. వొడ్డుకు కొట్టుకవస్తోంది. ఆ నురుగు ప్రాతఃకాల సూర్యారుణకాంతిలో ధగధగమెరు స్తోంది. ఆనకట్ట బ్రిడ్జి చుట్టుపక్కల కొండలు, నీళ్ళల్లో ఎంతో అందంగా కనుపిస్తున్నాయి.

అందరితోపాటు నేను కృష్ణానదిలోదిగి కాసేపు ఈత కొట్టి, గట్టుకుచేరాను. పొడిబట్టలు వేసికొని పదిగజాలు నడి చానో లేదో ఎవళ్లో జనం అక్కడమూగి, ఏదో సందడి చేయటం చూచాను, నేను అక్కడికి వెళ్లాను.

ఒక మనిషి ఎవరో ఖంగుఖంగున దగ్గుతూ నేలపైన పడి పొర్లుతూ మూలుగుతున్నాడు. చిక్కి శల్యమై అస్థి

పంజరంలా వున్నాడు. ఎంతో ఆయాసంగా ఎగరొప్పుతున్నాడు.

అక్కడవున్న జనమంతా "ఎవరో దిక్కులేనివాడు మరణయాతన అనుభవిస్తున్నాడు— ఎంతోసేపు బతకడు" అంటూ అందరూ తలోవిధంగా అనసాగారు.

ఎవరో పాపం ఒకచెయ్యి కాలులేని మధ్యవయస్సు స్త్రీ అతనివద్దనే కూర్చొని రోదిస్తోంది. మరోఅమ్మాయి జాలిగా ఆమెకేసి చూడసాగింది, తనకేమి అర్థంకానట్టు— అతడు స్పృహకలిగాక, ఆమెనుచూసి "నువ్వా?" అని ఆశ్చర్యంగా అన్నాడు.

ఆ ఆడది మాట్లాడలేదు. గుడ్లనిండా నీళ్ళుమాత్రం నింపుకుంది, సమాధాన సూచకంగా,

"నేను మహాపాపిని, కిరాతకుణ్ణి నీకు ఎంతో అపచారం చేశాను, దానికి తగిన ప్రతిఫలం అనుభవిస్తున్నాను. భగవంతుడు నాదుర్మార్గానికి తగిన ఫలితాన్నిచ్చాడు. అనుభవిస్తున్నాను" అని ఏమేమో అనసాగాడు.

ఇదంతా చూసిన అమ్మాయి "ఎవరే అమ్మా?" అని ఆమె నడిగింది.

మధ్యవయస్సు స్త్రీ "మీ నాన్న..." అనిగొణిగింది.

"నాన్నా!... నాన్నా!" అంటూ ఆ అమ్మాయి అతనిమీద పడి ఏడవసాగింది.

అతడు కూతుర్ని దగ్గరికి తీసుకొని కౌగిలించుకున్నాడు. "నీకు మీ అమ్మకు ఎంతో అపచారం చేశాను" అని ఇంకా ఏమేమో చెప్పబోయాడు కాని దగ్గుతెర వచ్చింది. నోటి వెంట రక్తం పడ్డది— మగతగా కళ్ళు మూశాడు. స్పృహతప్పింది. అంతలో ఆ అమ్మాయి, "నాన్నను ఇంటికి తీసుకపోదాం పద వే— ఇక్కడెందుకూ!" అంది.

తల్లి జాలిగా అందరికేసి చూచింది సహాయాన్ని అపేక్షించినట్టు- ఎవరూ ముందుకు రాలేదు. ఆ దృశ్యాన్ని చూచి, నాలో నిద్రాణమైయున్న మానవత్వం చిగర్చసాగింది. సహాయం చేయడానికి ముందు అడుగువేశాను. నా తరువాత మరో ఇద్దరు కూడా తయారై ముందుకువచ్చారు.

అనతి దూరంలోనే వున్న వాళ్ల గుడిశకు అతన్ని చేర్చాం. తరువాత తక్కిన ఇద్దరూ వెళ్ళిపోయారు— నేను మరో రెండు గంటలవరకు అక్కడే వుండిపోవాల్సి వచ్చింది. ఈలోపల ఆ స్త్రీ నేను చేసిన సహాయానికి ఎంతో కృతజ్ఞత తెలిపింది మొదట వాళ్లను చూడగానే, 'ఎవళ్లో మష్టివాళ్లు కామోను' అనుకున్నాను. కాని ఆవిడ మాటలు విన్నాక ఎవరో పతనమైన ఉన్నత కుటుంబీకుల్లా తోచింది. 'ఈదుర

వ_స్త ఎందుకు వచ్చిందా? ఆపిడకు ఒక కాలు చేయి ఎందుకు లేవు? పుట్టుకతోనే లోపమా? లేక మధ్యలో సంప్రాప్తమైన దుర్గతా? భర్త ఈవిధంగా ఎందుకయ్యాడు? తల్లీ కూతుళ్లు ఈ గుడిశలో ఎందుకుంటున్నారు,' అని నాలో ఉత్పన్నమైన అనేక ప్రశ్నలు సమాధాన రహితంగానే వుండిపోయాయి.

ఆ కష్ట సమయంలో వాళ్ళని ఆ ప్రశ్నలడిగి కష్టపెట్టటం నాకిష్టం లేకపోయింది. వాళ్ళు అట్టే మాట్లాడలేదు. కాసేపటికి అతనికి ఉపచారాలు చేసినమీదట తెలివివచ్చింది.

"సరూ... సరూ..." అని అన్నాడు.

"ఏమండీ?" అంది

"నీకు ద్రోహం చేశాను సరూ..." అని చిన్నపిల్లవాడిలా రెండుచేతుల్లో మాసిన గడ్డంకల మొహాన్ని దాచుకొని, ఏడవసాగాడు.

"ఏడవకు నాన్నా— జబ్బు ఎక్కువౌతుంది" అంది ఆ పిల్ల.

అతడుఏదో మూలుగుతోనే గొణగసాగాడు "విన్ను పెళ్ళిగొట్టాక ఆ భోగందాని దగ్గరే మూడేళ్లువున్నాను... సంపాదన తగ్గి తాగుడు ఎక్కువైన మూలాన దాని అనాదరణకి పాల్పడ్డాను, అది నన్ను లెక్కచేయనట్లు, నాయిం

ట్లో నేవుండి. తనవృత్తి చేసుకోసాగింది. అది నేను సహించలేకపోయాను ఈర్ష్యతో వేగి దానిపై తిరగబడ్డాను. అది తన నూతన విటుల సహాయంతో నన్ను వెళ్ళగొట్టటానికి ప్రయత్నించింది. దాంతో మూలనవున్న కఱ్ఱను తీసి రెండు బాదాను. నామీద హత్యాప్రయత్న నేరం ఆరోపించి ఆరునెల్లు కఠినశిక్ష వేశారు. కాని నాకేమీ బాధ అనిపించలేదు. నీకు చేసిన ద్రోహానికి తగిన శాస్తి జరిగినట్టు అనుకున్నాను. జీవితం మీద విరక్తి పుట్టింది. కాని నిన్ను కడసారి చూచి ఒకసారి క్షమాభిక్ష కోరుకొని మరణిద్దామని జీవించసాగాను... ... ...

“పల్లెపల్లెలో రైలు రైలులో కనపడిన ప్రతి ఆడదాని ముఖంలో నీ పోలికలకోసం వెతికి వేసారి పోసాగాను ఏనాడైనా నువ్వు కలుస్తావనే నమ్మకం, నా ప్రాణాన్ని నిల్పివుంచింది. తాగుడువల్ల, జైలు జీవితంవల్ల ఆరోగ్యం పాడై క్షయగా పరిణమించింది... ...

“నన్ను క్షమించవూ...?” అన్నాడు. ముగింపుగా...

ఈ మాటలు చెపుతూ వున్నప్పుడు ఆవేదనవల్ల, ఆయాసంవల్ల, బాధపడసాగాడు. మధ్యమధ్య ఒకటి రెండు సార్లు దగ్గుపొరలు కూడా వచ్చాయి. కూతురు ఎక్కడిదో పాలు తెచ్చి అతనికిచ్చింది. అతను వద్దని సైగచేశాడు. ఒక్క

సారిగా పెద్ద దగ్గుతెరవచ్చి అతన్ని ముంచెత్తివేసింది. దాని ధాటికి ఆగలేక అతడు లోబడిపోయాడు.

తల్లీ, కూతురూ గొల్లుమన్నారు. పూరిగుడిశ రోదనాల ఆలయమయింది. నాకేమీ తోచలేదు. 'అనవసరమైన కష్టంలో ఇరుక్కున్నానా?' అనిపించింది.

వాళ్ళను వోదార్చి, నలుగురు సహాయకుల్ని తీసుక రావడానికి వెళ్ళాను.........

... ... ... ...

* * *

ఆ వేళ ఏమీతోచక కృష్ణానది వొడ్డుకు షికారుకు బయలుదేరాను. నదీ సౌందర్యాన్ని చూస్తూ చాలాసేపు అక్కడే వుండిపోయాను. నదీ కెరటాలు చంద్రుడి కిరణాలతో ఆడుకోసాగాయి. చివరకి ఇంటికి బయలుదేరాను. అకస్మాత్తుగా ఎదో పాట నన్ను నిలపెట్టింది. చాలా శ్రావ్యంగా మధురంగా వుంది. ఒక్కసారిగా నాదృష్టి ఆ పాట వచ్చే దిశవైపు మళ్ళింది.

"నను పాలింప నడిచివచ్చితివా" అనే త్యాగరాజ కృతి మోహనరాగంలో వినిపించసాగింది. నాదృష్టి తిన్నగా ఓ గుడిశవైపు ప్రసరించింది. నాకు హటాత్తుగా కొన్నాళ్ళ క్రిందట జరిగిన సంఘటన జ్ఞాపకం వచ్చింది. వెళ్ళి ఆ పూరి

గుడిశముందు ఆ గాను, పాటవింటూ, కాసేపటికి పాట ఆగింది. "చాల పొద్దుపోయింది ఇక పడుకో తల్లీ"

"అప్పుడేనా అమ్మా!"

"తెల్లవారు జామున లేచి పాడుకుందువుగాని"

నవ్వూ కూతురూ మాట్లాడు కుంటూన్నట్లున్నారు. అప్రయత్నంగానే నాకు పొడిదగ్గు వచ్చింది

"బైట ఎవరో ఉన్నారే, అమ్మా" అంది కూతురు.

తల్లి బైటికివచ్చి చూచింది. లేత వెన్నెల్లో గూడా నన్నుగుర్తించి "నువ్వా బాబూ!- లోపలికిరా" అంది.

అనాలోచితంగానే వెంబడించాను. నాకు ఏమిమాట్లా డాలో తోచలేదు "మీ అమ్మాయి చాలా బాగపాడుతుం దండీ" అన్నాను.

"అదంతా మీ అభిమానం బాబూ" అంది-

"గొప్పవాళ్లెప్పుడూ తమ గొప్పతనాలు వొప్పుకోరు" అన్నాను.

ఆ అమ్మాయి సిగ్గుపడసాగింది.

"ఎక్కడ నేర్చుకున్నావు, అమ్మాయ్!"అని అడిగాను

"మా అమ్మదగ్గర" అని అంది, ముక్తసరిగా...

"మీరూ పాడతారా?"

"ఏదో పాత కాలవు పాటలు"

"పాటకు క్రొత్తా పాతా ఏమిటండీ!"

తర్వాత కాసేపు ఎవరూ మాట్లాడలేదు–

చివరికి నేనే "మిమ్మల్ని ఒక సంగతి అడుగుతా చెపుతారా!" అని కదిపాను

"దానికేం బాబూ– అడుగూ" అంది.

"మీ వద్ధతి చూస్తూవుంటే ఏదో ఉన్నతకుటుంబానికి చెందినవారని నా అంతరాత్మ వ్రబోధం చేస్తూ వుంది. దయతో మీ గాధ చెప్పగలరా?"

"నా జీవితమంతా కలుషితమైపోయింది. నేను ఒక నిర్భాగ్యురాల్ని. పతితను అందరిచేత హేయంగా చూడబడే వ్యక్తిని. నా కథ ఎందుకు బాబూ!" అంది.

ఒకమూలగా గుడ్డిదీపం మిణుకుమిణుకు మంటోంది. తల్లీకూతుళ్లు ఒక నులక మంచంమీద కూర్చున్నారు. తాటాకుల సందుల్లోనుంచి వెన్నెలవచ్చి ఇంట్లోపడుతోంది గుడిసంతా దారిద్ర్యదేవత నాట్యానికి దాసోహం అన్నట్లుంది. "నాస్వభావమే వేరు. ఎందుకనో బాధపడే వ్యక్తుల్ని పతనమైనవాళ్లని చూస్తే, నా హృదయం ద్రవీభూతమౌతుంది. తక్కిన అందరి నీచమానవుల్లాగే కథవిని అవహేళన చేస్తానని భావించవద్దని ప్రార్థన." అని తిరిగిఅన్నాను

ఆమె తన కథ చెప్పసాగింది "నాకు రెండేళ్లప్పుడు మా నాన్న చనిపోయాడు మా అమ్మే నన్ను అష్టకష్టాలుపడి పెంచింది. పెద్దచేసింది. ఆమెగారి అన్నకొడుక్కి నన్ను ఇచ్చి పెళ్లిచేసింది. ఆయనగారు శాస్త్రపూర్వకాలంవాడు. పాటలు అవీ పనికిరావు స్త్రీ పెద్దమనిషితరహాగా వుండాలనీ అనవసరంగా ఇతరులతో మాట్లాడ కూడదని చెవుతూ వుండేవాడు. పగటిపూట ఎప్పుడూ నాతో మాట్లాడేవాడు కాడు. నాకు సంగీతం అంటే ఎంతో ప్రేమ, ఇష్టం. అందువల్ల ఎప్పుడూ ఏవో పాటలు పాడుతూ తిరుగుతూ వుండేదాన్ని. ఆయనకి అలావుండటం ఇష్టమయ్యేది కాదు.

"ఎందుకు అలా పొద్దుకూకులు భోగం వాళ్ళలా పాడుతూ వుంటావు, సంసారి లక్షణాలు నీలో ఏమాత్రం లేనట్లుందే?" అని మందలించేడు. ఆ మాటలు నాకు కోపాన్ని కలుగజేసేవి.

నేను "నా ఇష్టం వచ్చినట్లు పాడుకోకూడదా" అని నాలోనేను ప్రశ్న వేసుకునేదాన్ని.

ఎంతైనా నామనస్సు పాటలమీదే వుండేది. అన్నం వండుతూ, వడ్డనచేస్తూ నాలోనేను ఏదో పాడుకుంటూ వుండేదాన్ని. అస్తమానం ఏదోపాట గొణుగుతూవుండేదాన్ని

రెండు మూడుసార్లు ఆయన నన్ను మందలించాడు.

నేను ఆయనమాట వినకుండా అలాగే పాడుతూ వుండేదాన్ని. దానిమీద ఆయనగారికి కోపంవచ్చి నన్ను కొట్టాడు.

"ఈసారి నీనోటిమీదినుంచి పాటవినపడ్డదా, అంటే ఇంట్లోనుంచి వెళ్ళగొడతా" నన్నాడు—

"నాకు వాక్స్వాతంత్ర్యం లేదా? స్త్రీలు బానిసలా? పురుషులు తమ యిష్టం వచ్చినట్లు సంచరించవచ్చా? నేను పాడుకుంటే ఎందుకు వద్దనాలి! సంసారంచేసే స్త్రీలుమాత్రం పాటలు పాడుకోకూడదా?" అని ఏవేవో విషయాలు నాలో నేను ఊహించుకునేదాన్ని. నా జీవితమంతా ఏదో దుర్భర యాతనలు అనుభవిస్తూవున్నట్లే భావించేదాన్ని. ఆవిధంగా కొంతకాలం నాలో నేను బాధపడుతూ వుండేదాన్ని.

"ఆ రోజుల్లో ఉప్పు సత్యాగ్రహం గాంధిమహాత్ముని నాయకత్వంలో జరుగుతోంది. స్త్రీస్వాతంత్రియాన్ని గురించి, పరాయి ప్రభుత్వం మనల్ని పెట్టే బాధల్ని గురించి, ఒక రాజకీయ నాయకుడు మావూళ్లో వుపన్యాసం చెప్పేడు ఆ వుపన్యాసాన్ని వూళ్లో వాళ్లంతా, ఎంతో మెచ్చుకున్నారు. నేను దాన్ని విని ఎంతో ఆనందపడ్డాను.

"ఎక్కడో వుండే పరాయిప్రభుత్వం, మనల్ని బాధపెట్టటంలో ఆశ్చర్యంలేదని, భావించాను—మన యిళ్లల్లోనే మన మగవాళ్ళు బానిసలకన్నా హీనంగాచూస్తూ నానాబాధలు

పెడుతూవుంటే, వారు చేసేదానిలో తప్పేమిలేదని భావించాను- ఆ విధంగా కొంతకాలం, నేను నాలోనే ఎన్నో" బాధలు పడుతూ, అనేక సుడిగుండాల మధ్య తిరుగుతూ, అనేక ఆవేదనలు పడుతూ జీవయాత్ర సాగించాను.

ఆతరువాత కొంతకాలానికి మావూరికి ఒక నాటక సమాజంవచ్చింది. వాళ్లుఊళ్లో నాటకాలు వేస్తూవుండేవారు. ఆనాటకంలో ప్రధానపాత్ర వేసేవాడు బ్రాహ్మడు.

"మా వూళ్లో బ్రాహ్మలఇల్లు మాదిఒక్కటే కనుక ఆయనగారు ప్రతినిత్యం మాయింట్లోనే వుంటూ, మాదగ్గరే భోజనంచేస్తూ, మాలో ఒకమనిషిలాగా మెలుగుతూ ఎంతో చనువుగా వుండేవాడు. మాయింట్లో ఇతర పెద్దదిక్కు ఏదీ లేకపోవటంవల్ల నేనే ఆయనగారికి వడ్డిస్తూవుండేదాన్ని. మొదటిరోజుల్లో ఆయనగారితో అంతచనువు లేకపోయినా క్రమంగా చనువులాగా ఏర్పడింది.

"అవి ఎండాకాలపురోజులు, రైతులు ఎంతో ఉత్సాహంగా వున్నారు. ఆ సంవత్సరం పంటలు బాగా పండాయి. రోజవిడిచి రోజు నాటకాలు ఆడుతూ వుండేవారు. ప్రతి నాటకంలోను ఆ బ్రాహ్మడే ప్రధానపాత్ర ధరించేవాడు. ఆయన కంఠం ఎంతో మాధుర్యంగా వుండేది- ఆయనగారు పద్యం చదివాడు అంటే, అంతా ఎంతో మెచ్చుకునేవారు.

వన్స్‌మోర్లు కొట్టించేవారు. చూచేవారంతా ఎన్ని పర్యాయాలు వన్స్‌మోర్లన్నా మళ్ళీ చదివేవాడు. విసుగుపడేవాడుకాదు. ప్రజలంతా ఆయనగారి నటనా కౌశల్యానికి ఎంతో సంతోషపడేవారు. ఏ పాత్ర ధరించినా, ఏ వేషం వేసినా, ప్రతిదానికి సరిగా సరిపోయేవాడు.

"నెల పదిహేనురోజులు వాళ్ళు నాటకాలు ఆడారు. ఆ రోజుల్లో సినిమాలు అసలే లేవు. ఎక్కడో బస్తీలల్లో ఎవరో ఒకరు చూచేమని చెప్పుకుంటూ వుండేవారు. పల్లెటూళ్ళల్లో వీధి భాగవతాలు తోలుబొమ్మలాటలు, దొమ్మరాటలు. కోడిపందేలు ఎక్కువగా వుండేవి. ఎప్పుడైనా మంచి నాటకాలు ఆడేవారు వస్తూవుండేవారు.

"ఆ నాటకసమాజం వారు మా ఊళ్లో చాలారోజులు వుండటంచేత, అంతా వాళ్లమీద ప్రేమకలిగి వుంటున్నారు.

"ఒకనాడు సాయంత్రింపూట మావారు ఎరువుబళ్ళ వెంట పొలంవెళ్ళారు. ఇంట్లో ఎవ్వరూలేరు. నేను ఒక్కదాన్నే వున్నాను. అందువల్ల నిర్భయంగా 'రామా నీ సమానమెవరురా' అనే త్యాగరాయ కృతి ఖరహరప్రియ రాగంతో ఆలాపన చేస్తున్నాను. అంతలో ఆ బ్రాహ్మడు వచ్చాడు. నా పాటను బయటనించే విన్నాడేమో ?

'మీరు చాలా బాగాపాడుతారు' అని నన్ను ఎంతో మెచ్చుకున్నాడు

'ఏదో పాడుతానండి' అని సిగ్గుపడుతూ తలువుచాటుకు పోయాను.

'ఏదో పాడుతానంటారేం- కోకిల స్వరం- ఎంత బావుందనుకున్నారు. మీపాట-' అని నన్ను తెగపొగిడాడు. ఇంకోపాట పాడమని బలవంతం చేశాడు.

"నేను 'మరివేరే దిక్కెవరయ్యా రామా' అనే కృతి వన్మఖప్రియ రాగంతో పాడాను.

'ఇక ఆయన ఆనందానికి అంతులేదు 'ఎంత బావుంది నీపాట' అని నన్ను ఆకాశంలో కూర్చోపెట్టాడు. దాంతో నాకు ఆయనమీద ఒకవిధమైన అభిమానం ప్రేమఏర్పడింది- క్రమంగా ఆయనకనపడ్డప్పుడల్లా ఏదో కూనిరాగాలు తీస్తూ వుండేదాన్ని. నావైపు అదోవిధంగా చూస్తూ వుండేవారు.

"మా యిద్దరి మనస్సులో ఒక విధమైన, అనురాగం ప్రేమ ఏర్పడింది, ఒకరిపైన ఒకరికి. నేను వీలైనప్పుడల్లా ఏదో పాటలు పాడుతుండేదాన్ని- ఆయనగారు విని సంతోషిస్తూ వుండేవాడు.

"ఆ బ్రాహ్మడు క్రమంగా నామీద అనురాగం ప్రకటిస్తూ, నాకు దగ్గరదగ్గరగా రావటమూ నాచేతులో

వున్న వస్తువులను అందుకోవటమూ, ఏదో చెప్పలేని ఆనం దాన్ని పొందుతూవుండటమూ చేస్తూవుండేవాడు.

ఒకరోజు ఏదో పని వుండటంవల్ల మా వారు పొరు గూరువెళ్లారు. రాత్రి తొమ్మిదిగంటలైంది. ఇంకారాలేదు. నేను మా యింటి ముందువున్న వేపచెట్టు కింద కూర్చొని 'తెరతీయరాదా' అనేకృతి గౌడిపంతు రాగంతో ఆలాపిస్తు న్నాను. మాజీతగాడు బర్రెల పాలుపితుకుతున్నాడు. వెన్నెల పిండారబోసినట్లు కాస్తోంది చల్లని గాలి వీస్తోంది. అంతలో ఆ బ్రాహ్మడు వచ్చాడు.

ఏమండీ ఇంకా మీవారు రాలేదా?' అని అడిగాడు.

'రాలేదండీ'

'చాలా పొద్దుపోయింది ఇక రారేమో ననుకుంటాను' అన్నాడు.

'వారు ఈ పూట వచ్చేట్టులేరు. మీరు భోజనం చెయ్యండి- వడ్డిస్తాను.' అని చెప్పాను.

'ఇంకాసేపు చూద్దాం- వారు వస్తారేమో!'

'ఫరవాలేదు- మీరు భోజనం చెయ్యండి' అన్నాను.

"తరువాత నేను లోపలికివచ్చాను. జీతగాడు ఇంటికి వెళ్ళిపోయాడు-

'నీవు ఇందాక పాడినపాట మళ్ళీ పాడు' అన్నాడు.

నేను పాడాను. ఆయనగారు నాదగ్గరకు వచ్చికూర్చున్నాడు. 'నీ కంఠంలో అమృతం తొణికిసలాడుతోంది' అని నన్ను మెచ్చుకున్నాడు. తరువాత నాచేతిని తన చేతిలోకి తీసుకు న్నాడు. నేనేమి అనలేదు. నన్ను తనకౌగిలిలోకి తీసుకున్నా డు. నేను చిత్రప్రతిమలా ఆయన కౌగిలిలో ఏదో అనిర్వచ నీయమైన తన్మయత్వం పొందుతున్నాను. అలా ఎంతసేపు గడిచిందో తెలియదు. నా శరీరం అప్రయత్నంగానే అతనికి లొంగిపోయింది.

"దాంతరువాత రెండు రోజులవరకు మావారు ఏదో కారణాంతరాలవల్ల ఊరినుంచి రాలేదు. ఆ రెండురోజులు మాపని మూడుపూవులు, ఆరుకాయలుగావుంది. ఆ రెండు రోజుల్లో ఆయనగారు నాకు ఎన్నో ఆశలు కలుగజేశాడు. నాలో నిద్రాణమైవున్న గానపిపాసను ద్విగుణీకృతం చేశాడు.

"నన్ను తనవెంట తీసుకవెళ్ళుతానని, నాకు గొప్ప గొప్ప విద్వాంసులచేత, సంగీతము సాహిత్యము నేర్పిస్తానని నాకీర్తియావదాంధ్రదేశంలో మారుమోగిపోతుందని, నేను త్యాగబ్రహ్మ అపరావతారాన్నని, ఇంకా ఏమేమో తెలియ జేశాడు.

'సంగీతము, సాహిత్యము, శిల్పము, చిత్రలేఖనము,

కవిత్వము మొదలైన మహావిద్యలు పూర్వజన్మ సుకృతం వల్ల లభించేవని, ఆ మహా విద్యలతో కాలుతరిస్తూ తద్వారా సంఘాన్ని తరింపజేయవచ్చుని, తద్వారా భగవసాన్నిధ్యాన్ని పొందవచ్చుని......' ఇంకా ఏమేమో చెప్పాడు.

'తనకు ఇంకా వివాహం కాలేదని, నన్నే వివాహం చేసుకుంటా'నని చెప్పాడు. నేను ఆయనగారు చెప్పింది అంతా నమ్మాను, ఊరు పేరు తెలియని ఆ మనిషివెంట లేచిపోవటానికి వొప్పుకున్నాను. ప్రయాణానికి అన్నీ సిద్ధం చేశాను.

"అనుకున్న ప్రకారం ఒకనాటి అర్ధరాత్రి ఆయన వెంట బయలుదేరాను. మర్నాడు సాయంత్రానికి గుంటూరుకు చేరుకున్నాం, అక్కడ కొంతకాలం వున్న తరువాత తెనాలిలో కాపురం పెట్టాం. నాకు ఒక సంగీత విద్వాంసుడి చేత సంగీతం చెప్పించసాగాడు. నేను లేచివచ్చిన వేళా విశేషంవల్ల ఆయనగారు అప్పట్లో నాటకాల్లోనుంచి బైటపడి పెద్దపెద్ద నాటకసమాజాల్లోగూడా వేషాలువేయటం మొదలు పెట్టాడు, అందువల్ల ఆయనగారి పేరు యావదాంధ్ర దేశంలో మారుమోగి పోయింది. సంపాదన జాస్తిఅయింది. గొంతు సరిగ్గా వుండాలని తాగుడు అలవాటు చేసుకున్నాడు. ఆ అలవాటు క్రమంగా అధికమైంది. విదేశీ సారాయీలు తాగటం ప్రారంభించాడు.

"ఒక భోగం స్త్రీ ఆయనగారితో వేషాలు వేస్తూ వుండేది. ఆమెతో ఆయనకు సంబంధం ఏర్పడింది. ఆమెను వేరే ఇల్లు అద్దెకు తీసుకొని అందులో వుంచాడు. క్రమంగా నాదగ్గరికి రావటం నాతో మాట్లాడటం తక్కువ చేశాడు. రాత్రింబవళ్లు ఆమెతోనే వుంటూ కాలం గడిపేవాడు. ఎప్పుడైనా నాదగ్గరికి వస్తే ఎంతో కోపంతో వచ్చేవాడు. ప్రతి దానికి ఎంతో మండిపడుతూ వుండేవాడు.

"ఆమెతో స్నేహం ఎక్కువైనా కొద్దీ నాటకాలకు పోవడం గూడా తక్కువ చేశాడు. క్రమంగా సంపాదన తగ్గి పోయింది. తాగుడు అధికమైంది.

"ఒకరోజు బాగా తప్పతాగి నేను వున్నదగ్గరికి వచ్చాడు. ఆ మైకంలో ఏమేమో వాగాడు. నన్ను బాగా కొట్టాడు. రెండుసంసారాలు తాను ఈదలేనని, ఆమెనుగూడా ఇక్కడికి తీసుకవస్తానని" అన్నాడు. నేను మాట్లాడలేదు.

"రెండురోజుల తరువాత ఆమెను తీసుకవచ్చాడు. ప్రతినిత్యం మాంసం వగైరాలు తెచ్చి నన్ను వండమనేవాడు. నాకు అవి వండటంరాక ఎంతో బాధపడేదాన్ని. దాంతో నన్ను చావ చితకపొడిచేవాడు. క్రమంగా నా జీవితమంతా ఎంతో దుర్భరమైపోయింది.

"నేను నాచుట్టూ నిర్మించుకున్న మహాసౌధాలన్ని

కూలిపోసాగాయి నాకు జీవితమంటే ఎంతో రోతా అసహ్యం పుట్టింది.

"ఒకనాడు జోరుగా వర్షం పడుతోంది. ఉరుములు, మెరుపులు ఎంతో భయంకరంగా వున్నాయి. రాత్రి పడకొండు గంటలు కావస్తోంది. బాగా తాగివచ్చాడు. నన్ను ఏవో పని చేయమని పురమాయించాడు. ఆపని చేస్తూనే వున్నాను. కాని కొంచం ఆలస్యమైంది. అంతలోనే ఆ భోగం స్త్రీ నామీద ఏవో చాడీలు చెప్పింది. దాంతో మండిపడుతూ నాదగ్గరికి వచ్చి మీాదబడి రోకలిబండతో చావబాదిచాడు. నా నెత్తిమీద బలమైన గాయాలు తగిలాయి. నన్ను ఇంట్లో నుంచి ఆ అంధకారంలోకి నెట్టి లోపలతలుపు వేసుకున్నాడు.

"బాధతో, సిగ్గుతో, అవమానంతో, అక్కడినుంచి బయలుదేరి, ఆ వర్షంలోనే కృష్ణ కాలువదగ్గరికి వచ్చాను. ఆ సమీపంలో వున్న ఎలక్ట్రిక్కుదీపాల వెలుగులో నా. శరీరాన్ని చూచుకున్నాను. నాకు ఎంతో భయంవేసింది ఆవేదనతో అవమానంతో కృంగిపోయాను. ఆకాలువలో పడిచచ్చిపోదా మనుకున్నాను కాని నేను అప్పటికి ఏడుమాసాల గర్భవతిని. నాతోపాటు నాకు జన్మించబోయే; ఆ పిల్లో పిల్లవాడో కూడా ఆవిధంగా చనిపోవటం నాకు ఇష్టంలేకపోయింది.

"చచ్చి ఎవర్ని సాధిస్తావు? బ్రతికుంటే ఏమైనా చేయ

వచ్చు. ఇదంతా నీవు యవ్వన మధాంధంలో కన్నుగానక చేసినదానికి ఫలితం— అనుభవించు —" అని నాకు ఎవరో ప్రబోధం చేస్తూవున్నట్లు తోచింది.

"ఇక ఆత్మహత్య చేసుకోకూడదని నిశ్చయం చేసుకున్నాను అందువల్ల అక్కడ నిలుచోలేకపోయాను. రైలు స్టేషనుకు వచ్చాను. అప్పుడే ఒక రైలు బయలుదేరుతోంది. దానిలో ఎక్కికూర్చున్నాను. ఆబండి ఎక్కడికిపోతుందోనని గూడా ఆలోచించలేదు. ఒక బల్లమీద పడుకున్నాను. రెండు రోజుల తరువాత సికింద్రాబాదు చేరుకున్నాను.

"అక్కడ కలవారి ఇళ్ళల్లో చాకిరీ చేసుకుంటూ జీవయాత్ర సాగించేను

"ఒక ఆసుపత్రిలో పురుడు పోసుకున్నాను. ఈ పిల్ల పుట్టింది. క్రమంగా పదిరోజులు వెళ్ళిపోయాయి. ఆసుపత్రి నుంచి బైటికివచ్చాను. అమ్మాయికి 'భారతి' అని పేరుపెట్టుకున్నాను.

"ఎన్నో కష్టాలుపడుతూ ఈపిల్లను పెద్దదాన్నిచేశాను. దీనికి అయిదు సంవత్సరాలు నిండాయి. దీనిపోలికలన్నీ ఆయనగారివే. అందువల్ల ఈ పిల్లనుచూస్తే నాకు ఎంతో అసహ్యం వేసేది. కాని క్రమంగా దానిమీద మమకారం ఏర్పడింది. దాని తప్పేముంది...? అంతా నాదేగా!" అని అనుకున్నాను.

"భారతికి ఆరు సంవత్సరాలు వచ్చాయి, తన ఈడు పిల్లలందరితోను కలసి ఆడుకొంటూవుండేది వాళ్ళతో పాటు తనకూ అన్నీ కావాలనీ, అడుగుతూవుండేది. నేను సాధ్యమైనంత వరకూ ఏ లోపంలేకుండా చూస్తూవుండేదాన్ని.

"ఒకనాడు బాగా చీకటిపడింది. ఒకచోట పనిచేసి నాబసకు వస్తున్నాను. ఏదో ఆలోచించుకుంటూ, పరధ్యాన్నంగా నడుస్తున్నాను. ఒక కారుక్రింద పడ్డాను నాకు స్పృహతప్పిపోయింది. మళ్ళీ కళ్ళు తెరిచి చూచేప్పటికి నేను ఆస్పత్రిలో వున్నాను. కుడి చేతికి, కుడి కాలికి బలమైన గాయాలు తగిలాయి, డాక్టరు కుడిచేయి తీసివేయాలన్నాడు కుడి కాలు మోకాళ్ళవరకు పనికిరాదన్నాడు. కర్రకాలు వేయించాలన్నాడు డాక్టరు సలహాప్రకారం ఆవిధంగా ఆపరేషను జరిగింది, ఆరుమాసాలు హాస్పిటాలులోనే వున్నాను.

"హాస్పిటాలులో వున్నన్నిరోజులు నాభారతి ఎన్నో కష్టాలు పడ్డది. తిండితిప్పలు వేళకు దొరక్క ఎన్నో బాధలు పడ్డది

"బాగా నయమైంతరువాత హాస్పిటాలునుంచి బయట పడ్డాను ఏం లాభం అవిటిబ్రతుకు. ఆలా ముష్టిఎత్తుతూ, నానాబాధలు పడుతూ, సికిందాౖబాదులోనే కొంతకాలం గడిపాను,

"అంతలో సంస్థానమంతా ప్రజాపోరాటం స్వాతంత్రి మోద్యమం ప్రారంభమైంది.

"రజాకార్లు విజృంభించారు. ఘోరకృత్యాలు జరగటం ప్రారంభించాయి. సంస్థాన ప్రజలంతా బయటకు వలసరావటం ప్రారంభించారు. నేను ఈ పిల్లను తీసుకొని బయలు దేరాను—" అని చెప్పి పెద్దనిట్టూర్పువిడిచి కాసేపూరుకుంది.

నేను ఆమె చెప్పిన సంగతులన్నీ నెమరు వేసుకో పాగాను.

అంతలో మళ్ళీ ఆమె చెప్పటం ప్రారంభించింది, "ఏనాడైనా ఈ బెజవాడలోనే వారు నన్ను మళ్ళీ కలుస్తారనే నమ్మకంతో ఈ పవిత్ర కృష్ణానదీ ప్రాంతంలో నివాసం ఏర్పాటు చేసుకున్నాను. ఎన్నో రాత్రులు వార్ని గురించి, వారి క్షేమాన్ని గురించి ఆలోచించుకుంటూ కాలంగడిపాను. ఈసంగతి భారతితో చెప్పలేదు. చెపితే అది బాధపడుతుంది, ఎంతో కుమిలిపోతుంది. అందువల్ల ఈసంగతి ఎవరికి చెప్పలేదు. చెప్పాలని వుద్దేశంగూడా నాకులేదు ఎందువల్లంటే ఈ నాగాధవింటే నన్ను క్షమించరు. పైగా హేళన చేస్తారు. అవమానపరుస్తారు. అందువల్ల ఎవరితోను చెప్పలేదు. ఈనాడు నీబలవంతం మీద చెప్పాను. నా మనస్సులోని బాధకొంత తగ్గింది. మనవాళ్ళు సహజంగా అంటూ

వుంటారు, "చేసిన పాపం చెబితే పోతుం"దని. అందువల్లే చెప్పాను. అని ఏదో బాధగా నావైపుచూచింది. ఆకస్మిదీపపు వెలుగులో.

నేను ఈలాంటి పవిత్ర హృదయులు, నిష్కల్మషులు మన సమాజంలో వున్నందుకు ఎంతో సంతోషించాను. ఆమెమీద నాకు ఎంతో ఆదరం అభిమానం ఏర్పడింది. అందువల్ల ఆమెను గురించే మనస్సులో మననంచేస్తూ ఆలోచింపసాగాను.

మళ్లీ ఆమె అందుకుంది "బాబూ! నా అదృష్టం పండింది. భగవంతుడు దయతలచాడు. ఆరోజు నీవుచూచావే అప్పుడే నేను ఆయనగార్ని చూచాను. ఆషాఢ శుద్ధ ఏకాదశి రోజు ఆయనగార్ని చూచినందుకు ఎంతో సంతోషంకలిగింది, అపవిత్ర పర్వదినం రోజు ఆయనగార్ని చివరసారి చూడ గల్గినందుకు నాకు చాలా సంతోషంగావుంది... ఆయన్ని ఎంతో ప్రేమించాను...... ఆయనమీద నావంచ ప్రాణా లుపెట్టుకోని బ్రతికాను. నా చేతుల మీదుగా నే ఆయనగారి అంత్యక్రియలు జరిపాను". అంది ఎంతో సంతృప్తిగా శ్వాస వదలుతూ.

"ఇన్ని విధాలుగా మిమ్మల్ని మోసగించి నానా బాధలకు గురిచేసిన అవ్యక్తిని మీరేలా ప్రేమించ గలుగు

తున్నారండీ." అని అడిగాను. నాలోవున్న కోపాన్ని ఆపుకోలేక.

"బాబూ స్త్రీలహృదయం నీవు తెలియదు. వారు ఏవ్యక్తినైనా సంపూర్తిగా ప్రేమించారంటే ఇక జీవితంలో వాళ్లనిమరచిపోలేరు...ఆవ్యక్తికోసం తమ సర్వస్వాన్ని త్యాగంచేస్తారు...తమ ప్రాణాల్నికూడా బలిచేయగలుగుతారు...అదే స్త్రీలకున్న ప్రత్యేకత... నాకు ఆయనగారు ద్రోహం చేసినమాట వాస్తవం. దాన్ని ఎవరుకాదనలేరు... అయినా నేనువార్ని ప్రేమించాను...పవిత్రప్రేమ సింధువదిలా గాంభీర్యంగా వుంటుంది. దానిలోతు కనుక్కోవటం మహా కష్టం. అదిచాలా క్లిష్టమైన సంగతి..." అని చెప్పింది— ఎంతో ఆవేదనతో

మీరు ఎన్నిచెప్పినా నేను ఈఒక్క విషయంలో మాత్రం మీతో ఏకీభవించలేనండీ"—అన్నాను.

"ఆసంగతి నాకు తెలుసు ... అలాంటి వ్యక్తిని మీ పురుషులు సహించలేరు. స్త్రీ తనప్రేమ చిహ్నంగా సర్వస్వాన్ని సహిస్తుంది—, హాలాహలానైనా, సహించగలదు...అదే స్త్రీల ప్రత్యేకత—" అంది.

నేను సమాధానం చెప్పకుండా ఆమెవిచిత్ర ప్రకృతిని గురించి ఆలోచింపసాగాను.

అంతలో ఆమె మళ్ళీ నెమ్మదిగా ప్రారంభించింది.

"ఈభూమిమీద పుట్టిన ప్రతివ్యక్తి కర్మఫలితాన్ని అనుభవించాల్సిందే... నా సంగతేమూడు... నేను తప్పు చేశాను... దానికితగిన ఫలితాన్ని అనుభవించాను. ఆయన గారు తప్పుచేశాడు. దానికి తగినశిక్ష అనుభవించాడు. ఇదంతా ఏమంటావు?" అంది నావైపు చూస్తూ.

నేను మాట్లాడలేక పోయాను...తలకాయ వంచు కోని ఆమె తెలివి తేటలకు వివేచనాశక్తికి ఆశ్చర్యపడ సాగాను.

"మేమిద్దరం కలిసినవేళా విశేషం అటువంటిది ఎన్ని కష్టాలను అనుభవించినా, ఎన్ని బాధలుపడ్డా ఆయనగారు నన్ను మరచిపోలేదు, నేను ఆయనగార్ని మరిచిపోలేదు... ఆయనగారిమధ్య నామధ్య అలాంటి తెంచరాని సంబంధం ఏర్పడింది. మాయిద్దరి సంబంధం అలాంటి పవిత్రమైంది..." అనివూరుకుంది,

"ఇంకా ఒక్క సంగతి అడుగుతాను, కోపం రాదు కదా?"

"అడుగు తప్పేంలేదు—కోపం అంతకంటే లేదు"

"మీరు చేసుకున్న భర్తను విడిచిపెట్టి రావటం మంచి దంటారా?"

అది చాలా తప్పు...ఆ సంగతి నాకు తెలుసు...
దానికే నేను మనస్సులో ఎంతో బాధపడుతున్నాను...
మానసికంగా కృంగిపోయాను. ఇదంతా పూర్వజన్మకర్మ
ఫలితం...దాన్ని ఇన్నిరూపాలుగా అనుభవిస్తున్నాను.
ఆనాడు యౌవన మదాంధంలో కన్నుగానక. చేసుకున్న
భర్తను విడిచి పెట్టాను. దానికి తగినశిక్ష అనుభవించాను
...ఇంకా అనుభవిస్తున్నాను. అనుభవించిక తప్పదు..."
అంది ఎంతో బాధతో నన్ను ఏదో ప్రశ్నిస్తున్నట్టు చూస్తూ,

"నిజమే" అని మాత్రం అన్నాను.

"అదంతా గత చరిత్ర...దాన్నిగురించి ఎంత అను
కున్నా లాభంలేదు. ఏమిచేసినా లాభంలేదు... ఈ శేషిం
చిన జీవితాన్ని శ్రీరామచంద్రమూర్తి లీలల్ని తలుచుకుం
టూ, ఈ పవిత్ర కృష్ణా ప్రాంతంలో గడప దలచాను...
ఈలాంటి దుస్సంఘటనలు ఏ తావ జన్మలోనైనా జరక్కుండా
వుండాలనేదే నా కోరిక... ఈ నాచిట్టితల్లి పెళ్ళిచేస్తే నా
బాధ్యత తీరిపోతుంది ... నాకష్టాలు గట్టెక్కుతాయి ...
దానికి సంగీతమంతా నేర్పాను... బాగా బొమ్మలు వేయటం
గూడా వచ్చు..." అంది ఆమె నావైపు ఆదోలాచూస్తూ.

"సంబంధాలు ఎక్కడైనా కుదిరాయా ?"

"లేదు బాబూ"

"పరియత్నం ఏమైనా చేస్తున్నారా?"

"ఎందుకు చెయ్యటం లేదు!.... చేస్తూనేవున్నాను. కాని ఎక్కడా లభ్యం కావటంలేదు. ఈనాడు సంఘసంస్కర్తలమని చెప్పేవారంతా పైకిపేరుకోసరం నాటకం ఆడుతూ వేదికలమీద ఉపన్యాసాలు దంచేవారే కాని, మాలాంటి దిక్కుమాలినవారి పిల్లల్ని ఎవరు చేసుకుంటారు బాబూ!" అంది నావైపు ఎంతో దీనంగచూస్తూ

"కళా హృదయంవున్న ఏవ్యక్తి కాదంటాడు? నేను చేసుకుంటాను... ఈ సంఘం నన్నేంచేస్తుందో చూస్తాను?... కాని మీరు నాకుఇవ్వటానికి వొప్పుకుంటేచాలు" అన్నాను. తటాలున— క్షణిక నిశ్చయానికి వచ్చి.

"ధన్యురాల్ని బాబూ! నాజీవిత పరమావధి ఈనాటికి సిద్ధించింది". అంది ఎంతో సంతోషంగా— ఈఆకస్మిక నిర్ణయానికి ఆశ్చర్యపోతూ,

"చాలాపొద్దు పోయింది ... రేపు మళ్ళీవస్తాను. మాట్లాడుకుందాం" అని వాళ్ళదగ్గర శెలవుతీసుకొని ఇంటి దారి పట్టాను.

దూరంగా ఎక్కడనుండో ఆరోహణాక్రమంలో సన్నని సంగీతం వినపస్తోంది— నరూ జీవితాన్ని లీలగా నా మనో నేత్రం ముందు గోచరింప జేస్తున్నట్టు.

# సార్థకమైన తీర్థయాత్ర.

ఆఫీసు నుంచి ఇంటికి వచ్చి కోటువంకెకు తగిలించి, కుర్చీలో కూలబడ్డాను. సిగరెట్టు ముట్టించేను. శరీరమంతా ఒడలికగా వుండటం వల్ల కళ్లుమూసుకున్నా. అంతలో వుదయం పూట పోష్టు జవాను ఇచ్చిన వుత్తరం జ్ఞాపక వచ్చింది. లేచి కోటు జేబులో నుంచి తీసి, కవరు చింపి, చూచాను, కుర్చీలో కూలబడి, దీపాన్ని దగ్గరికి లాక్కొని ఉత్తరం చదవటం మొదలుపెట్టాను;

హైదాబాదు,
24-3-52.

శ్రీ, పరిశాశం గారికి,

నమస్కారములు,

ఈమధ్య మీ దగ్గరినుంచి వుత్తరాలు లేవు కారణం తెలియటం లేదు; మన స్నేహం మామూలు రైల్వే స్నేహం గా వుండకూడదని ఆరోజే మీతో చెప్పివున్నాను, అయినా మీరు నన్ను మరిచి పోయారు. కాని నేను మిమ్మల్ని మరిచి పోలేకుండా వున్నాను. మీతో స్నేహం కలిసినవేళా విశేషం అటువంటిది. నేను తీర్థయాత్రలు చేస్తూవున్న సమయంలో నాకు ఎంతోమంది కొత్తవాళ్ళతో స్నేహం కల్సింది. కాని

మీలాగా నా హృదయాన్ని కొద్ది సమయంలోనే ఆకర్షించ గలిగినవారు ఎవరూ లేరంటే నమ్మండి.

దక్షిణదేశ యాత్రలన్నీ చేశాం. అనేక పట్టణాలు పుణ్యస్థలాలు తిరిగాం. కాని ఎక్కడా మీలాంటి హృదయం వున్నవ్యక్తి నాకు కనపించలేదంటే నమ్మండి.

మా శ్రీమతి తీర్థయాత్రాఫలితంగా గర్భవతి అయిన సంగతి మీకులోగా తెలిపేవున్నాను. మొన్న ప్రసవించింది. మగశిశువును కన్నది.

భగవంతుడు మాయందు కరుణ తలచాడు. కనుక మేంచేసిన తీర్థయాత్ర సార్థకమైంది.

ఆ రోజున మీరు బెజవాడ సత్రంలో "తీర్థయాత్రల వల్ల పిల్లలు పుడతారండీ'' అని అన్నారు. జ్ఞాపకంవుందా?

నా జాతకంలో పురుష సంతానం వుందని, ఆసంగతే ఒక గొప్ప జ్యోతిష పండితుడు చెప్పాడని, మీతో చెపితే ఏమన్నారో గుర్తుందా? "మంత్రాలకి చింతకాయలు రాల్తా యా, తాతగారూ!'' అని నన్ను హేళనచేసేరు.

మన భారతభూమి అతిపవిత్రమైంది. ఈ దేశంలో అనేకమంది మహావ్యక్తులు భూత భవిష్యద్వర్తమానకాలాల్ని గురించి, అత్యద్భుత విషయాల్ని చెప్పేవారున్నారని ఆనాడు నేనంటే, ఏమన్నారో జ్ఞాపకంచేసుకోండి.

నిర్మలమైన మనస్సుతో ఆ పరాత్పరుణ్ణి సేవిస్తేకాని వసేమిటి?

నేను రెండో పెళ్ళి చేసుకోవటం మంచిదికాదన్నారు?

తీర్థయాత్రలు చేసి ఉండగ పడటం తప్ప వొరిగేది ఏమీ లేదన్నారు?

మరి చూచారా? భగవత్కృప వుంటే కానిదే ముంది? ఇప్పుడు ఆ వెనుకటి సంగతులన్నీ ఎందుకు జ్ఞాపకం చేస్తున్నానంటే,

మీరు స్వయంగావచ్చి మా తీర్థయాత్రా ఫలితాన్ని చూచిపోవాలనేదే మా వుభయుల కోరిక తెలుపడానికే. తప్పకుండా రావాలి...

ఇట్లు భవదీయుడు,
పురుషోత్తం."

ఆ వుత్తరం చదువుతూవుంటే నాకఒక్కసారిగా గతించిన చరిత్ర కళ్ళలో మెరిసింది.

* * *

ఆరోజు నేను ఏదో అర్జంటు పనిమీద బెజవాడ వెళ్ళుతున్నా. స్టేషనుకు వెళ్ళేప్పటికే ప్లాటుఫారం మీద బండి ఆగివుంది. అందువల్ల వెంటనే టిక్కెట్టు తీసుకొని బండ్లో ఎక్కాను. నేను ఎక్కిన దబ్బాలంతా కిటకిటలాడిపోతోంది. ఒక అంగుళం చోటుగూడా లేదు.

జోరుగా వర్షం పడుతోంది. ఆకాశం అంతా నల్లని మేఘాలు ఆవరించివున్నాయి. ఉరుములు, మెరుపులు మహా ప్రళయంగా వున్నాయి. హోరుగాలి వీస్తోంది. అప్పటికే చాలా రాత్రైపోయింది. రైలు అంధకారాన్ని ఛేదించుకుంటూ ఆవర్షంలో ముందుకు మెల్లగా సాగిపోతోంది. నేను బెర్తింగు చేతిలో పట్టుకొని, ఛలికి వణుకుతూ ఆ జనంలో నే నిలుచున్నాను. నా ఎదురుగా వరుసలో కూర్చొని వున్న అమ్మాయివైపు ఎలక్ట్రిక్కు దీపాల వెలుగులో చూస్తున్నా ను. ఆ అమ్మాయి కూర్చొని నిద్రపోతోంది ఆ నిద్రావస్థ లోకూడా ఎంతో అందంగా కనిపిస్తోంది. 'సహజసౌందర్యం జాగ్రదావస్థలోకన్నా నిద్రావస్థలో నే ఎక్కువగాగోచరిస్తుం' దని ఎక్కడో చదివాను. ఆ వాక్యం ఈ అమ్మాయిని చూచాక యథార్థ మనిపించింది.

ఆ అమ్మాయి పెట్టుకున్న మల్లెపూల వాసనలు డబ్బాంతా ఆ వర్షపు చల్లటిగాలికి ఘుమఘుమ వీస్తున్నాయి.

ఆ చల్లటిగాలికి నాలో ఏవో ఆలోచనల తరంగాలు ఉద్భవిస్తున్నాయి. ఆ తరంగాల్లో వూగుతున్నాను— రైలుతో బాటు.

నాచుట్టూ నిలుచోనివున్న జనం విపరీతంగా గొడ చేస్తున్నారు. చుట్టలుకాలుస్తూ, అక్కడే వుమ్మివేసుకుంటూ

ఏదో హంగామా చేస్తున్నారు.

డబ్బాలో అంతా పడుకోని నిద్రపోతున్నారు. కూర్చోటానికి సందు ఎక్కడా కనుపించటం లేదు.

స్టేషన్లు వస్తున్నాయి; పోతున్నాయి. అక్కడక్కడ కొంతమంది దిగుతున్నారు. దిగేవారికన్నా ఎక్కేవారి సంఖ్యే అధికంగా వుంది.

జైటవర్షం ఏదో మహాప్రళయాన్ని సూచిస్తూవుంటే 'ఈ జనమంతా ఎక్కడినుంచి వస్తున్నారా? ఎక్కడికిపోతు న్నారా!' అని నాలో నేను ఆలోచిస్తున్నాను.

అంతలో మహబూబాబాదు స్టేషన్ వచ్చింది 'గరం గరం చాయ్' అంటూ ఒక కుఱ్ఱాడు వచ్చాడు. చలిగా వుండటం చేత ఒక కప్పు నిలుచోనే తాగేను డబ్బాలో చాలామంది తాగేరు.

నా ఎదురుగా బెరసలో వున్న అమ్మాయి ప్రక్కనే కూర్చోని వున్న ఏభై సంవత్సరాల వయస్సులో వున్న ఒక పురుషుణ్ణి చూచేను. అతను "ఏమేవ్, టీ తాగు" అని ఆ అమ్మాయిని లేపాడు.

ఆ అమ్మాయి కళ్ళు తెరిచింది "వద్దండీ" అంది.
"కాస్త వేడిగా వుంటుంది తాగు" అన్నాడు
"అక్కర్లేదండీ"

"ఛలిగాలి వీస్తోంది; వెచ్చగా వుంటుంది. ఒక కప్పు తాగు" అని చేతికందించాడు.

ఆ అమ్మాయి ఆయిష్టంతోనే తీసుకొని చప్పరించింది. మళ్ళీ కళ్ళుమూసింది.

ఆ పిల్ల అందాన్ని చూస్తూవుంటే నా ఆలోచనలు పరిపరి విధాలుగా పోసాగాయి. భగవత్సృష్టిలో ఈలాంటి అందమైనవాళ్లు వున్నందుకు ఎంతో సంతోషించసాగాను.

ఆ అమ్మాయి బక్కపలచగా వుంది, గులాబీ రంగు శరీరం, మిసమిసలాడే అవయవాలు; నునుపైన బుగ్గలు; నల్లటి వెంట్రుకలు; అందమైన ముఖం. ముఖానికి తగ్గకళ్లు, ముక్కూ— ఎంతో ఆకర్షణీయంగా వుంది.

తెల్లవాయిలు చీర; ఆకుపచ్చ జాకెట్టు తొడుక్కొని వుంది లోపలినుంచి ఆమె ఎత్తైన వక్షోజాలు ఆ తెల్ల కాంతిలో వింతవింత శోభల్ని కలుగజేస్తూ వున్నట్లు తోచింది.

"ఈ అప్సరసతో జీవయాత్ర సాగిస్తున్న అదృష్టవంతు డెవడా?" అని నాలో నేను ఆలోచిస్తున్నా.

అంతలో ఓ ముష్టిది తడిసిన గుడ్డల్తో చంకనపిల్లాణ్ణి వేసుకొని బండిలోకి ఎక్కింది. అది ఏదో పాడుకుంటూ అందర్ని తలోదమ్మిడి అడుక్కొంటోంది. కాసేపు దానివైపు చూచాను. దానిమీద నాకు జాలివేసింది. "ఉదరపోషణా

ర్థాయ బహుకృతవేషః" అనే వాక్యం జ్ఞాపకం వచ్చింది. నా జేబులో చేయిపెట్టాను. చిల్లరలేదు- ఒక రూపాయి బిళ్ళవుంది. అది తీసి దానిచేతిలో వడేసేను. "బాబూ, పొరపాటున రూపాయి యిచ్చేరు—" అంది. "నీ అదృష్టం తీసుకో" అన్నాను. "మా మంచిదొరలు— బహు దొడ్డ దొరలు. ముష్టివోళ్ళమీద దయగల ప్రభువులు ..." అని నన్ను తెగపొగిడింది.

డబ్బాలో వున్న వాళ్ళంతా నావైపు అదోవిధంగా చూడసాగేరు. నేను తలకాయ వంచుకున్నాను.

"ఈలాంటి ప్రభువులు వుండబట్టే మాలాంటిముష్టి వోళ్లకు తిండి తిప్పలు దొరుకుతున్నాయి". అని ఏమేమో అనుకుంటూ వెళ్లిపోయింది.

ఆ ఏభై సంవత్సరాల వయస్సులోవున్న పెద్దమనిషి "ఈలావొచ్చి కూర్చోండి" అన్నాడు. కొద్దిగా తన పక్కన చోటుచూపించి, నాఅవస్థచూచి, జాలిపడ్డవాడిలా.

"ఎందుకండీ" అన్నాను.

"ఫరవాలేదు"

"..............."

"రాండి" అన్నాడు మర్యాదగా.

నేను వెళ్లికూర్చున్నాను. అంతలో ఓర్నకల్లుస్టేషను వచ్చింది, బండిచాలాసేపు ఆగింది. బైటవర్షం కుండపోతగా వుంది చాలామంది జనం దిగిపోయారు,

"వర్షం తెగ దంచుతోంది" అన్నాడు, ఆపెద్దమనిషి.

"అవునండీ" అన్నాను నేను

హైదాబాదులో మేము బయలుదేరేప్పుడు వర్షం వచ్చే సూచనలైనా కనపడలేదండీ".

"ఓహో! అలానా!"

"ఎక్కడిదాక మీ ప్రయాణం?"

"బెజవాడ"

"ఏంపని మీాద?"

రైలులో లభ్యమైన స్నేహితులువేసే ప్రశ్నలకు జవాబులు చెప్పటమంటే నాకు చాలా చికాకు. వాళ్లువేసే అనవసర ప్రశ్నలకు జవాబు చెప్పాలంటే నాకు వళ్లుమంట కూడా. అందువల్ల వినపట్లు మౌనంగా వూరుకున్నాను—

"మిమ్మల్నే—అడిగేది"

"కాస్త పనివుండి వెళ్లుతున్నాను".

"మీా దేవూరని, ఏంచేస్తున్నావని"—అన్నిరకాల ప్రశ్నలు వేసేడు. నేను చెప్పక తప్పలేదు, చెప్పా, తరు

వాత నేను ఆయన్నడిగాను "మీ దేవూరండీ?" అని మర్యాద కోసం—

"హైదాబాదు."

"ఏం చేస్తారు అక్కడ తమరు?"

"రివిన్యూ డిపార్టుమెంటులో ఉద్యోగం"

"ఇవ్వాడెక్కడికి దాక మీ ప్రయాణం?"

"అలా పుణ్యక్షేత్రాలు చూచివద్దామని బయలు దేరాం"

"ఎవరెవరు వెళ్తున్నారు?"

"నేనూ మా శ్రీమతీ—"

"వారేరండీ?" అని అడిగేను.

తన పక్కనఉన్న అమ్మాయిని చూపించేడు. నన్ను నేను నమ్మలేకపోయాను. ఆశ్చర్యంగా ఆయనగారివైపు చూశాను.

"ఈ అమ్మాయి నా ద్వితీయ కళత్రమండీ"— అన్నాడు మళ్ళా.

"ఓహో. అలానా?" అన్నాను.

"నా ప్రథమ భార్య చనిపోయింది. అది పదిసంవత్స రాలు కాపరంచేసింది. పిల్లలు పుట్టలేదు. అదిగులుతోనే

ఆది భగవస్సాన్నిధ్యాన్ని చేసుకుంది. తరువాత చాలా కాలంవరకు నేను పెళ్ళి చేసుకోలా. ఒకనాడు మాయింటికి ఒక గొప్పజ్యోతిష పండితుడు వచ్చాడు; నన్ను మళ్ళీ పెళ్లి చేసుకోవల్సిందనీ; నాకు సంతాన ప్రాప్తివుందనీ నావంశం నిర్వంశం కావటానికి వీల్లేదనిన్నీ, నాకు ఎంతో ఉజ్వలమైన భవిష్యత్తువుందనీ అన్నాడు. అందువల్ల ఈపిల్లను మళ్లీ పెళ్లి చేసుకున్నాను. ఈఅమ్మాయికాపురానికివచ్చి అయిదు సంవత్సరాలైంది. సంతానం కలుగలేదు. మళ్లీ ఆజ్యోతిష పండితుడే ఒక సంవత్సరం క్రింద వచ్చాడు. రామేశ్వరం మొదలైన తీర్థయాత్రలు సేవిస్తేతప్పకుండా పిల్లలు పుడతారని నన్ను ఆశ్చర్యపడవద్దనీ చెప్పాడు. అందువల్ల దక్షిణ యాత్రలు ముగించుకోదలచా''నన్నాడు, ఎంతో ఆవేశంగా

''పాపం!"అని వేటకారంగా నవ్వేను నేను.

''ఏం బాబూ! నవ్వుతున్నావు?"అన్నాడు.

"తీర్థయాత్రలుచేస్తే పిల్లలుపుడతారాండీ?''అన్నాను

"ఎందుకు పుట్టరూ?"

"ఎప్పుడూ పుట్టరండీ

"మూర్ఖుడుగానిగా''

"ఏమిటి చూచేది!"

"జ్యోతిషశాస్త్రం ఎప్పుడూ అబద్ధంకాదు"

"అబద్ధమని ఎవరన్నారు?"

"నీవంటున్నావుగా?"

"నేను నా భావాలన్నీ చెప్పాను. ఈ కాలంవాళ్ళకు నమ్మకాలుండవు. కాని నేను వెనుకటివాణ్ణి నాకు నమ్మకం వుంది" అన్నాడు ఆయనగారు తనకు జ్యోతిషశాస్త్రంపైన వున్న నమ్మకాన్ని తెలుపుతూ

మా సంభాషణతోపాటే రైలు సాగిపోతోంది. మా డబ్బాలో చాలామంది దిగిపోయారు. మిగిలిన వాళ్ళంతా నిద్రలో మునిగితేలుతున్నారు.

బైట వర్షంకూడా చాలా తగ్గిపోయింది. మేమద్దరం ఆలాగే మాట్లాడుకుంటూ కూర్చున్నాం. అంతలో రాయనిపాడు స్టేషను వచ్చింది. జనమంతా క్రమంగా లేస్తున్నారు.

"ఈవేళ బెజవాడలో దిగి కృష్ణాస్నానం చేద్దామని వుందండీ"

"తప్పకుండా దిగండి"

"మాకు అక్కడ ఎవరూ తెలియదు"

"నేనున్నాను. ఫరవాలేదు దిగండి"

"దిగి కనకదుర్గాదేవిని కూడా చూడాలని వుందండీ"

"చూడవచ్చు; దిగండి" అన్నాను.

"రమా—లే" అన్నాడు.

"ఎందుకూ?" అంది నిద్రలోనే—

"బెజవాడ వస్తోంది; అందరు లేచేరు: నిద్రాలే—"

ఆ అమ్మాయి లేచింది కళ్ళు నలుపుకుంది "ఇంకా తెల్లవారలేదుకదండీ-" అంది ఎంతో తియ్యని గొంతుకతో

"నాలుగైంది- అదిగో బెజవాడ—" అన్నాడు.

"ఈయనగారెవరండీ?" అన్నట్లు నావైపు చూచింది.

నా సంగతి క్లుప్తంగా, చెప్పేడు-ఆయనగారు. తరువాత స్టేషనులో దిగి సత్రానికి వెళ్ళాం...

ఆ సత్రంలో మూడురోజులు వున్నాం. ఆ మూడు రోజుల్లో బెజవాడ అంతా తిరిగాం. కృష్ణాస్నానం చేశాం కనకదుర్గ దర్శనం చేసుకున్నాం

పురుషోత్తంగారితో, రమాదేవిగారితో నాకు బాగా స్నేహం కుదిరింది. మేమంతా ఆ మూడురోజులు అనేక విషయాలను గురించి చర్చించాం. ముఖ్యంగా స్త్రీ స్వాతంత్ర్యాన్నిగురించి, వితంతు వివాహాల్నిగురించి, స్త్రీ విద్యను గురించి ఎన్నో వాదోపవాదాలు జరిగాయి.

రమాదేవి అనేక విషయాలల్లో నాతో ఏకీభవించేది నా భావాలు ఎంతో బావున్నాయని, నన్ను బాగా మెచ్చుకోసాగింది. నామీద ఒకవిధమైన అనురాగం ప్రకటించసాగింది.

ఒకనాడు పురుషోత్తంగారు బజారుకు వెళ్ళారు; నేను నాపనిమీద వెళ్ళాను. నేను నాపని ముగించుకొని సత్రానికి వచ్చాను అప్పటికి ఇంకా పురుషోత్తంగారు రాలేదు.

రమాదేవి ఎఱ్ఱంచు, ఆకుపచ్చ చీరకట్టుకొని వుంది. తెల్లరవిక తొడుక్కుంది. అద్దంముందు నిల్చొని తలదువ్వుకొంటోంది- ఎంతో అందంగా కనుపిస్తోంది.

ఆమెను చూస్తూవుంటే నాలో ఎన్నో ఆలోచనలు విజృంభించ సాగాయి

"ఇంకా పురుషోత్తంగారు రాలేదా?" అని అడిగాను.

"రాలేదండీ" అంది ఎంతో సిగ్గుపడుతూ తన నల్లని తల వెంట్రుకల్ని దువ్వెనతో దువ్వుతూ...

నేను ఆమె అందాన్ని చూస్తూ అక్కడవున్న చాప మీద కూలబడ్డాను.

"రమా, కాసిని మంచినీళ్ళిస్తారా?" అన్నాను.

"ఇస్తున్నా" అంది.

ఆమె ముఖం చూస్తూవుంటే ఆమెలో ఏదో ఆవేదన, ఏదో కోరిక నాకు ప్రస్ఫుటంగా గోచరించ సాగింది. అదే ఆలోచిస్తున్నాను.

ఆమె తొందర తొందరగా జడవేసుకొని, సూనచేతులు కడుక్కొని మంచినీళ్ళ గ్లాసుతో నాముందు ప్రత్యక్ష

మైంది. ఆ పైడిబొమ్మను చూస్తూవుంటే నాకు ఎంతో ఆనం దం కలిగింది.

ఆమె చేతిలో గ్లాసు తీసుకున్నాను. ఆమె చేతివేళ్ళు నాకు తగిలాయి. నాశరీరంలో ప్రేమ విద్యుత్తు ప్రసరించిం ది. ఏదో తన్మయత్వం పొందాను.

అలా కాసేపున్న తరువాత అప్రియాత్న్నంగానే "మిమ్మల్ని సంగతడుగుతా చెపుతారా?" అన్నాను.

"అడగండి- చేపుతాను" అంది ఎంతో నమ్రతగా

"మీలాంటి అందమైన స్త్రీ ఆ వృద్ధుడితో కాపురం చేయ గలుగుతున్నందుకు, నాకుఎంతో ఆశ్చర్యంగావుంది"

"..............."

"మిమ్మల్నే—?"

"..............."

"సమాధానం చెప్పరేం?"

"ఏం చెయ్యమంటారు—?" అని నన్నే ప్రశ్నించిం ది— సన్నగా

ఏమని సమాధానం చెప్పాలో తోచక తికమక పడ నాగేను—

తిరిగి ఆమె చెప్పసాగింది. "నాకు చిన్నతనంలో నే మా నాన్న చనిపోయాడు. మా అమ్మే నన్ను పెంచింది.

ఏడవ తరగతిదాకా చదువు చెప్పించింది సంబంధాల కోసరమని దేశమంతా గాలించింది. ఎక్కడికి వెళ్ళినా వేలు కట్నాలు కావాలని అడగసాగేరు. అప్పటికే నేను పెద్ద మనిషి నయ్యాను. అందువల్ల మావూరి వాళ్ళంతా నన్నూ మా అమ్మను నానాబాధలు పెట్టసాగేరు. ఆ బాధతో మా అమ్మ నన్ను విడిచిపోయింది. నేను ప్రపంచంలో ఏకాకి నయ్యాను—" కంట తడిపెట్టసాగింది.

"పాపం!" అని సానుభూతి ప్రకటించేను.

అంతలో ఆమెకు దుఃఖం ఎక్కువైంది. ముఖానగుడ్డ పెట్టకోని ఏడవసాగింది.

నేను నెమ్మదిగా ఆమెదగ్గరికి వెళ్ళి ఆమె చేతులు నాచేతిలోకి తీసుకున్నాను—

"ఊఁ. కో, రమా" అన్నాను గులాబిరేకల్లావున్న ఆమె చేతుల్ని నిమురుతూ,

కాసేపైన తరువాత ఆమె తన దుఃఖాన్ని దిగమింగింది.

ఆమె తలమీద చేయివేసి నిమురుతూ, "తరువాత సంగతి చెప్పూ!" అన్నాను.

"అవస్థెటూళ్ళో బాధలుపడలేక, సికిందా్రబాదులో మా వేలువిడిచిన, మేనమామగారింటికి చేరాను. ఆయన

గారికి నామీద దయగలిగింది. నన్ను మళ్ళీ స్కూల్లో చేర్పిం చేడు. చదువు కొంటున్నాను. మా అత్తయ్యగారు కాస్త పూర్వకాలం మనిషి. "ఆడపిల్ల చదువుకోని ఏం చేస్తుంది? ఎక్కడో సంబంధం చూచి ముడిపెట్టండి– ఈ రోజుల్లో చదువులంటే మాటలా! మన పిల్లలకే ఫీజులు, పుస్తకాలూ కట్టలేక బాధపడుతోంటే" అని సణిగేది.

"మా మామయ్యగారికీ నలుగురు మగపిల్లలు. ఇద్దరు ఆడపిల్లలు– మగపిల్లలంతా పెద్దవాళ్ళు. అంతా చదువు కొంటున్నారు. మా మామగారికి రెండువందల జీతం. ఆ జీతంతో పిల్లల చదువులకూ, పుస్తకాలకూ, ఇంటి అద్దెలకూ సరిపోక ఎంతో సతమతమౌతున్నాడు.

"ఎంతో బాధతో నేను 8వ తరగతివరకూ చదివేను, ఆ సంవత్సరం పరీక్ష అయినాను.

మా అత్తయ్య ప్రతిరోజు మామగారితో నా పెళ్ళి చేయమని పోరుపెట్టేది. మా వారికి, మా మామయ్యకు స్నేహం. ప్రతి శని ఆదివారాలల్లో హైదరాబాదు నుంచి మా మామయ్య దగ్గరికి వస్తూవుండేవారు. మాతో నే భోజ నం చేస్తూ వుండేవారు.

ఒకనాడు మా మామయ్య అత్తపోడు పడలేక పెళ్ళి చెయ్యటానికి నిశ్చయించుకున్నాడు. ఆయనగారిని అడిగాడు.

"తరువాత నాలుగు రోజులకు అన్నీ నిశ్చయమైపోయాయి, లగ్నాలు పెట్టారు. నాకాబోయే భర్తనుగురించి ఆలోచిస్తూ ఎంతో దిగులుపడసాగేను.

"మామయ్యతో" అనంగతే చెప్పేను.

ఆయనగారన్నారు. "అమ్మాయి కాస్త వయస్సు మళ్లినవాడనేగాని బాగా ఆస్తివుందమ్మా—సుఖపడతావు. అక్కడ అత్తలు ఆడబిడ్డలు ఎవరూ లేరు. బాగా సంపాదిస్తున్నాడు. పెత్తనమంతా నీదే. నీవేంచేసినా అడిగేవాళ్లు లేరు— నామాటవిని వొప్పుకో తల్లీ!" అన్నాడు.

"ఇంత పెద్ద ఈడు వాణ్ణి చేసుకోవాలా! మామయ్యా!!" అన్నాను జాలిగా.

"నన్నేం చేయమంటావమ్మా!"

నేనేమీ చెప్పలేకపోయాను.

"నాకు అన్నీ తెలుసుతల్లీ! కాని ఏంచేయమంటావు? ఎక్కడికి వెళ్లినా వేలుకట్నాలు కావాలంటున్నారు—" అన్నాడు ఎంతో బాధగా నిట్టూరుస్తూ.

నేను ఆలోచించేను, వృథాగా ఆయనగార్ని శ్రమ పెట్టటంతప్ప ప్రయోజనమేమి వుండదని. అందువల్ల 'సరే మామయ్యా! నీయిష్టం వచ్చినట్లు కానియ్యి' అన్నాను.

"నా పెళ్లి జరిగిపోయింది ఈలా కాపరంచేస్తున్నాను" అని ఎంతో హృదయభారంతో కిట్టూర్పింది.

ఆమెను నాదగ్గరికి తీసుకున్నాను. నా చేతులతో ఆమెని తనివితీరా స్పృశించేను, ఆమె పసిపిల్లలా నా కౌగిలలోకి మారింది. మేమిద్దరం మా శరీరాల్ని మరిచిపోయి ఏవో లోకాల్లో విహరించేం. అలా ఎంత సేపు గడచిపోయిందో మాకు తెలియదు......

రెండుగంటల తరువాత పురుషోత్తంగారు వచ్చేరు. తనకేవో పనివుండటంవల్ల ఆలస్యమైందని చెప్పేరు. అందరం కలసి భోజనాలుచేసేం,

ఆయనగారు ఏమీ కనిపెట్టలేదు. 'అందువల్లే నేనంటే ఒకవిధమైన ప్రేమకనపర్చటం నాలాంటివాణ్ణి తానుఎక్కడా చూడలేదనటం' సాగించేడు.

ఆయనగారు వెళ్లుతూ నాఅడ్రసు తీసుకున్నాడు. తన అడ్రసు నాకిచ్చేడు. తాను వుత్తరాలు వ్రాస్తుంటానని, నన్నూ

కూడా వాగ్దానమని చెప్పేడు. తరువాత నేనువరంగల్లు చేరాను.

రమ నావైపు రైలులో ప్రయాణమైపోతూ చివర సారి చూచిన చూపులు గుర్తువచ్చేయి. అందువల్ల నాకళ్ల వెంట నీరుకారటం ప్రారంభించింది. ఏదో బాధగా పడుకున్నాను.

అంతలో మాశ్రీమతి "ఏమండీ ఎంతసేపైంది ఇంటికి వచ్చి—అలా పడుకున్నారేం—తలకాయనొప్పిగావుందా? కాఫీ తాగరా." అని నాదివ్య స్వప్నాన్ని కరిగించి వేస్తూ సాగింది.

# "పిన్ని చాలా మంచిది"

సుగుణ అత్తగారికీ మామగారికీ; భర్తకు, మరుదులకు, ఆడబిడ్డలకు భోజనాలు పెట్టింది. వారంతా భోజనాలు చేసి, వెళ్ళిపోయిన తరువాత కృష్ణుడు జ్ఞాపకం వచ్చాడు. 'పండుగపూట అందరు భోజనాలు చేశారు. కాని వాడు ఒక్కడూ రాలేదేమో' అని ఆలోచించుకుంటూ ముందు వరండాలోకి వచ్చింది. వరండా అంతా చూచింది బైటిదరవాజా దగ్గర నిలుచోని "కృష్ణుడూ?" అని రెండు మూడుసార్లు పిలిచింది, ఎవరు జవాబు చెప్పలేదు. ఊకు పలుకలేదు మనస్సువుండబట్టలేకపోయింది. చివరకు 'కృష్ణుడూ?' అని పెద్దగా పిలిచింది. ఎంత పిలిచినా ప్రత్యుత్తరం రాలేదు

అప్పటికీ రెండు గంటలు కావస్తోంది. వీధిఅంతా నిర్మానుష్యంగావుంది. వడగాలి వీస్తోంది. సూర్యుడు తీక్షణంగా తన ప్రభావాన్ని ప్రదర్శిస్తున్నాడు. రాబోవు గ్రీష్మతాపాన్ని, దాని ప్రభావాన్ని, యిప్పుడే సహస్రముఖాలుగా ప్రదర్శిస్తున్నాడా? అన్నట్లుంది, దూరానవున్న మామిడి తోపులోనుంచి, కోకిలయొక్క "కూహూకుహూ" నినాదాలు ఎంతో శ్రావ్యంగా, మధురాతి మధురంగా వినిపిస్తున్నాయి, ఆ సమీపంలోనేవున్న వేపచెట్లకొమ్మల్లోనుంచి

కాకుల "కావు—కావు" శబ్దాలు కర్ణకఠోరంగా వినిపిస్తు న్నాయి.

"అయ్యో! పిల్లవాడు ఎక్కడ తిరుగుతున్నాడో, తిండి తిప్పలు లేకుండా?" అని సుగుణ ఎంతో పరితపించి పోయింది ఆ వెంట ఏవో గతించిపోయిన విషయాలన్నీ జ్ఞాపకం వచ్చినట్లున్నాయి.

అందువల్ల కళ్ల వెంట నీరు కారుస్తూ "కృష్ణుడూ?" అని గట్టిగా పిలుస్తోంది. ఆపిలుపులకు కృష్ణుడు పలుకలేదుగాని లోపల్నించి మామగారు మాత్రం వచ్చారు. "బాజారులో నిల్చోని ఎందుకలా అరుస్తున్నావు?......ఊ కృష్ణుడు ఎక్కడికి పోడులే...ఆలాపోతే యీ ఇంటిపీడే పోతుంది... మాయింటికి దాపురించాడు నిర్భాగ్యపు వెధవ......అందరి తోటి తిండికి చావగూడదా? ఈ వయస్సుకే యింత పొగరు బోతు తనం దేనికి? మాఇంటికి ఈలాంటి దౌర్భాగ్యాలు పొగడబట్టే లక్ష్మంతా పోతోంది. దరిద్రం తాండవిస్తోంది. ఆదరిద్రుణ్ణే యిక్కడికి తీసుకవచ్చేటప్పుడే నేను వద్దన్నాను. కాని నామాట వింటేగా!" అని వేయితిట్లు తిట్టాడు కోడల్ని......ఆమె మాత్రం మౌనంగా తలవంచుకోని అక్కడే నిల్చొంది.

"ఇంట్లోకి ఫో......"అని గద్దించాడు.

ఆమె కదల్లేదు. అలాగే నిల్చుంది.

"పిన్నీ?"

"............"

"వినపట్టంలా"

"............"

"మనిషివా? పగరానివా?"

"............"

"లోపలికి పోతావా! లేదా?"

"............"

సుగుణ తలపైకెత్తింది. కళ్లవెంట నీళ్లు జోటజోట కారుతున్నాయి. ఆమెకు మనస్సులో ఎంతో బాధగావుంది. అవమానంతో కృంగిపోయింది. నెమ్మదిగ అడుగులెయ్యటానికి ప్రయత్నిస్తోంది. కాని ఆమెకు కాలు లేవటంలేదు.

మామగారు సుగుణ కళ్ళవెంట నీరు కారటం చూచాడు "ఎందుకాలా పండుగపూట బాజారు వాకిట్లోనిలుచోని ఏడుస్తున్నావు? నీకు బుద్ధి జ్ఞానంలేదా ?... అభం శుభం లేకుండా ఆ ఏడుపులేమిటి? ఇంటికి పెద్దకోడలివై యుండి సంవత్సరాదినాడు ఆలా ఏడవకూడదని తెలియదూ! ఆ పాడుముండాకొడుకు ఈ కొంపలో అడుగుపెట్టినప్పటినుంచి ఇంటికళే పోయింది ........ లోపలికినడూ," అని మండి

పడుతూ గద్దించాడు, మళ్ళీ.

సుగుణకు ఆ మాటలన్నీ హృదయంలో శూలాల్లా గుచ్చుకున్నాయి.

ఆమె హృదయమంతా ఆవేదనతో అవమానంతో క్రుంగిపోయింది. నెమ్మదిగా లోపలికి నడిచింది.

"కడుపుకు తింటం తెలుసుగాని- అవుదూడలుకొట్టాం లో అలా అరుస్తూంటే వినిపించటంలా! జజాన్లో పెత్తనాలు చేస్తున్నావా?...... ఆడవాళ్ళకు బుద్ధివుండదు...... పశువులు......జ్ఞానశూన్యులు......" అని భర్తగదిలోనుంచి తిడుతూవుండటం వినిపించింది, సుగుణకు.

అందువల్ల ఆమె ఎడ్లకొట్టం వైపు నడిచింది. నేలకి పడేసివున్న చొప్ప దూడలకు వేసింది. అక్కడే పెట్టివున్న తొట్టెల్లో నీరుపోసి దూడలకుపెట్టింది. ఆ దూడలు ఆత్రంగా నీరు తాగుతున్నాయి " అయ్యో! ఎంత దప్పికగొన్నాయి- పశువులు!" అనుకుంది. వాటిని చూస్తూవుంటే ఎందుకో జాలివేసింది "పాపం నోరులేని గొడ్లు...... వనితొందరలో నీళ్ళుపొయ్యటం మరచిపోయాను...... ఎంత పాపిష్టి దాన్నో...!" అని మనస్సులో అనుకుంది.

తరువాత ఎడ్లగాడివైపు చూచింది. అందులో ఏదో కదులుతూ వున్నట్లు కనుపించింది. సన్నగా మూలుగుతూ

వున్నట్లు వినిపించింది ఆమె అక్కడికి వెళ్ళింది, గాభ్రావా చింది. కృష్ణుడు చింపిరిగడ్డ ముసుగు పెట్టుకొని పండుకున్నాడు. తనను యింతసేపటినుంచి విసిగించినందుకు, అన్నానికి రాకుండా అక్కడ పడుకొని వున్నందుకు ఎంతో కోపం వచ్చింది— సుగుణకు

అందువల్ల కోపంతోనే "కృష్ణుడూ!" అని అరిచింది. కాని వాడు లేవలేదు; పలుకలేదు.

"ఒరే పిన్నెపిలిచేది...? లేవ్వేం!" అంది.

కాని వాడుమాత్రం కదలలేదు.

ఆమెకు మామగారు అన్నమాటలన్నీ గుర్తువచ్చాయి. అందువల్ల విపరీతమైన కోపం వచ్చింది. ఆ దగ్గరలో వున్న చొప్పదంటు తీసుకొని "లేవ్వేం!" అని దబాదబా నాలుగు చరిచింది. అప్పటికీ వాడు లేవలేదు.

"నన్ను కొడుతున్నావురా! చచ్చేదద్దమ్మా! మా పిన్నితో చెప్పి నీపని పట్టిస్తానుండు. నేను తల్లిదండ్రి లేని వాణ్ణని, మీ యింట్లో వున్నాననేగా? నన్ను నీవు కొట్టేవి, మా పిన్నితో చెప్తానుండు...... మా పిన్నితో చెప్తానుండు.......నీపని పట్టిస్తానుండు......"

"అబ్బా! యిక కొట్టకురా! నీ కాళ్ళు పట్టుకుంటానురా" అని కలవరిస్తున్నాడు,

ఆమాటలన్నీ సుగుణవింది, ఆమెకు కొంత కథ అర్థ మైంది.

"అరే కృష్ణుడూ! ఏమిటా పిచ్చివాగుడు, లే!" అని వాణ్ణిపట్టిపట్టి లేపింది.

వాడిశరీరమంతా బండకాలినట్లు కాలిపోతోంది.

"అరే జ్వరం వచ్చినట్లుందే!" అని అనుకుంది.

"లే బాబూ!......"అని తన చేత్తోలేపి కూర్చో పెట్టింది, శరీరమంతా తెగకాగి పోతోంది.

ఆమెకు మనస్సులో ఎంతో బాధ అనిపించింది, కళ్లె వెంటనీళ్లు తిరిగాయి. "లేరాబాబూ! ఇంట్లోకి పోదాం" అంది.

ఆమెకు వాడిశరీరం నిండా ఎఱ్ఱగా కదుములు కట్టిన వాతలు కనుపించాయి, దానిపైన అప్పుడే తానుదంట్లతో బాదిన చారలుగూడా స్పష్టంగా కనుపిస్తున్నాయి. అవన్నీ చూచేప్పటికి సుగుణకు శరీరమంతా భయంతో వణుకు పుట్టింది "అమ్మయ్యో!"అని పెద్దగా అరిచి కూలపడిపో యింది,

ఆ అరుపువిని ఇంట్లోవాళ్లంతా వచ్చారు,

"ఏమిటి"

"ఏంకొంప మునిగింది?" అంటూ అంతా సుగుణ చుట్టూ మూగారు.

"ఏం జరిగిందిరా కృష్ణుడూ?"

"నిన్నే?..."

"చెప్పవేం?..."అని తలోప్రశ్న వేశారు.

వాడు భయంతో తన కేం తెలియదన్నట్లు గజగజ వణుకుతున్నాడు,

"చెప్పవేం...?"అని గద్దిస్తున్నారు.

అంతలో సుగుణ కళ్లు తెరిచింది "అమ్మయ్యో!" అని నిట్టూర్చింది, ఎంతో భయపడుతూ.

"అసలు సంగతేమిటి?" అన్నాడు మామగారు.

"చెప్పు......"అంది అత్తగారు.

"అలా చూస్తావేం......" అన్నాడు భర్త.

"నిన్నే......?"

"వినపట్టంలా?"

"మాట్లాడవేం" అన్నాడు మళ్లీ భర్త ప్రశ్నల వర్షం కురిపిస్తూ అంతా తలోరకంగా అంటున్నారు. ఆమెకు వళ్లు మండిపోయింది. కృష్ణుణ్ణి చూపించి "చూడండి! రాము, వాణ్ణి ఏలా వాతలు వచ్చేట్టుకొట్టాడో? అంది చాలాకోపంగా

"ఓ అదా!" అన్నాడు మామగారు.

"ఇదా వేషం!" అంది. అత్తగారు.

"పిల్లలు ఆడుకుంటూ ఒకర్నొకరు......" అన్నారు

నలుగురిగా నాలుగు మాటలు.

సుగుణ ఏమో అనబోయింది.

అంతలో "చావడులే" అన్నాడు మామగారు.

"ఛస్తే ఫరవాలేదులే" అన్నాడు ధర్మ నవ్వాపుకుంటూ.

"మనయింటి పీడేపోతుంది......" అంది అత్తగారు.

ఇక సుగుణకు కోపం ఆగలేదు నోటికి వచ్చినట్లు నాలుగు మాటలు అనేసింది. మీ పిల్లవాడైతే ఆలాగే అంటారా! ఆలాగే చూస్తూ వూరుకుంటారా? పరాయి అమ్మ కన్న బిడ్డకాబట్టి, దిక్కూ మొక్కూ లేకుండా, మీ యింట్లో వుండబట్టేగా...... ఆలా మీరంతా వాణ్ణి కొట్టడం...... నానా మాటలు అనడం– భగవంతుడు పైనవున్నాడు. మన ఆగడాలన్నీ చూస్తూనేవుంటాడు. మొన్న రామూను వాడు ఏదో అన్నాడని ఇంటిల్లిపాదంతా తిట్టారు, కోప్పడ్డారు. కొట్టారు, నేను ఎందుకని వూరుకున్నాను" అంది ఎంతో ఆవేదనతో.

"ఊరుకోక ఏం చేస్తుందో" అంది అత్తగారు.

"తలగిల్లి మిులేస్తుంది గాభోలు..... " అనిఅన్నాడు మామగారు హేళనగా.

సుగుణ ఏదో సమాధానం చెప్పబోయింది. కాని భర్త "వెధవ్వేషాలు వెయ్యక ఇంట్లోకి పద......" అని గదమాయించాడు. ఇక లాభం లేద ని, మాట్లాడకుండా కృష్ణుణ్ణి తన వెంటతీసుకోని యింట్లోకి పోయింది

"అన్నం తింటావు రా కృష్ణుడూ?" అని అడిగింది.

"వద్దు- పిన్నీ"

"నాలుగు కావస్తోంది. అంతా దేవాలయానికి పంచాంగం వినటానికి పోతారు. నీవు పోదుపుగాని కాస్త తిను—బాబూ" అంది

"నాకు వద్దు పిన్నీ"

"కొద్దిగా తిను బాబూ..."

"నోరంతా చేదు గావుంది పిన్నీ..."

"కొంచెం"

"తినను పిన్నీ"

"కళ్లు తిరుగుతున్నాయి పిన్నీ..."

"సంవత్సరాది పండుగరోజు ఉపవాసం దేనికి కొంచెం తిన బాబూ" అంది గడ్డంపట్టుకోని బ్రతిమాలుతూ.

"వద్దుపిన్నీ; పడుకుంటాను".

"అయితే నీయిష్టం పక్క వేస్తాను పడుకో" అని ఒక మంచం వేసి, దానిమీద తన పాతచీర వేసి పడుకో బెట్టింది. వాడిపక్కనే తాను కాసేపు పడుకొని సుగుణ మళ్లీ లేచింది. ఆమెకు ఆకలౌతోంది పొద్దుట్నించి చాకిరి చేసిచేసి వుండటం వల్ల శరీరమంతా ఆలసిపోయింది. లేవటానికి ఓపిక కూడా నసించింది. కాని ఎట్లాగో నెమ్మదిగ లేచింది. వంట ఇంట్లోకి వెళ్లింది. అన్నం పెట్టుకుంది. ఆమెకు తినబుద్ధి పుట్టలేదు. అవతల కృష్ణుడు పండుగపూట కటిక వుపవాసంతో బాధ పడతూవుంటే, ఆమెకు మనస్సంతా ఎంతో ఆందోళనపడ్డది. ఒకటి రెండు ముద్దలు నోట్లో పెట్టుకుంది. కాని మింగుడు పడ లేదు. వాంతి అయ్యేట్లు తోచింది ఇందనకటి సంఘటనే మాటిమాటికి గుర్తురాసాగింది. ఎంత ప్రయత్నించేసినా యిక నోట్లోకి ముద్దపోలేదు. అన్నమంతా పారేసి, లేచింది.

అప్పటికి బాగా పొద్దుగూక బోతోంది. ఇంట్లో అందరు కొత్తగుడ్డలు కట్టుకొని పంచాంగ శ్రవణానికి దేవాలయానికి వెళ్ళారు. కనుక ఇంట్లో ఎవ్వరూలేరు. సుగుణ కృష్ణుడు వున్న గదిలోకి పోయింది, వాడి మంచం మీద కూర్చుంది.

కృష్ణుడు గాఢనిద్రలో మునిగివున్నాడు. వాడిశరీరం పట్టుకొనిచూచింది. శరీరమంతా తెగ కాగిపోతోంది. పెద్దగ

శ్వాస వదులుతున్నాడు వాణ్ణి ఆ నివాస్థలో చూచేప్ప టికి ఆమెకు ఎంతో జాలివేసింది. విచారం కలిగింది. "నా కృష్ణుమా ? ఈ ఇంట్లో ఎన్ని బాధలు పడుతున్నావురా ? నాచిట్టితండ్రి......" అని మనస్సులో అనుకుంది. వెంటనే ఆమెకు కళ్ళవెంట నీరుతిరిగింది. గతించిపోయిన చరిత్రంతా ఒక్కసారి కళ్ళముందు మెదిలింది, సుగుణకు.

* * *

"నా ముద్దుచెల్లీ ! కృష్ణుణ్ణి నీచేతిలో పెట్టిపోతున్నాను. ఏలా కాపాడుకుంటావో ! వాణ్ని ఏలా పెంచిపెద్దవాణ్ణి చేస్తావో ? అదంతా నీకే తెలియాలి" అని తన అక్కగారు చనిపోయే ముందు చివరసారి అన్నమాటలు గుర్తువచ్చాయి సుగుణకు,

"అక్కా ! నీ పిల్లవాడికేం ఫరవాలేదు, వాడిప్రాణా నికి నాప్రాణం వొడ్డి కాపాడుకుంటాను. నీవు పిల్లవాడి విషయం బెంగపెట్టుకోకు. వాడి భారమంతా నాది. నీవు నిశ్చింతగా వుండు......" అని తాను అక్కగారిచేతి లో చేయివేసింది.

"నా చివరికోరిక చెల్లీ ...... మరిచిపోయేవు ... జ్ఞాపకం వుంచుకో... నేను వెళ్ళిపోతున్నాను..." అని అక్కగారు ప్రాణంవిడుస్తో చివరక్షణంలో అన్నది. "ఫరవా

లేదు. అక్కా! నీ పిల్లవాడికేం భయంలేదు... నేనున్నాను
గా.. ..." అని తాను అభయ హస్తం ఇచ్చిం తరువాత
ఆమె ప్రాణం వదలింది.

తల్లి చనిపోయేప్పటికి కృష్ణుడికి మూడు సంవత్సరాల వయస్సు. కృష్ణుడు తనతల్లిపొట్టలో వుండగానే తండ్రి చనిపోయాడు. తరువాత నాలుగు నెలలకు కృష్ణుడితల్లి వాణ్ణి కన్నది. మూడుసంవత్సరాలు ఎంతో అల్లారుముద్దుగా పెంచింది చివరకు తాను చనిపోతూ పిల్లవాణ్ణి తన చెల్లెలు చేతిలో పెట్టింది.

కృష్ణుడి తండ్రిగారు బ్రతికున్న రోజుల్లో స్కూలు మేష్టరుగా పనిచేసేరు. వారు బాగా చదువు చెప్తారని మంచి ప్రతీతి వుండేది. బీదపిల్లలకు ఉచితంగా చదువు చెప్తుతూ, తనకువచ్చే జీతపురాళ్ళతో తృప్తిపడుతూ మంచిపరువు ప్రతిష్టలతో జీవయాత్ర సాగించాడు.

కృష్ణుడి తల్లిపేరు శాంత. ఆమెగారు తన పేరుకు తగినట్టుగానే ఎంతో శాంత స్వభావురాలు. మంచి స్ఫురద్రూపి.

సుగుణ తండ్రిగారి పేరు సీతారామయ్యగారు. ఆయనగారు చాలా ఉదారస్వభావులు. ధర్మపరాయణులు. నీతి నియమాలతో, కొన్నికట్టుబాట్లతో, ఆదర్శాలతో జీవ

యాత్ర సాగించేవాడు. ఆయనగారికి భార్యా వియోగం సంభవించేప్పటికి శాంతకు నాలుగు సంవత్సరాల వయస్సు. సుగుణకు ఒక్క సంవత్సరం వయస్సు మాత్రమే. అప్పుడు వారు నడివయస్సులో వున్నాడు వారి వయస్సులో వున్న వారు ఇంకెవరన్నా అయితే మళ్ళీ వివాహం చేసుకునేవారే. ఎంతో మంది ఆయనగారితో "మగపిల్లలు లేరాయెను. రెండో పెళ్ళి చేసుకోండి" అని సలహా చెప్పారు. కాని సీతారామయ్యగారు మాత్రం "నాకు మగపిల్లలైనా వాళ్ళే- ఆడపిల్లలైనా వాళ్ళే —— ఇక నేను రెండో పెళ్ళి చేసుకునేది లేదు" అని కచ్చితంగా చెప్పారు.

ఆయనగారు ఆ యిద్దరు ఆడపిల్లల్ని ఎంతో గారాబంగా పెంచాడు. వాళ్లకు తల్లిలేనిలోపం ఏమాత్రం కనపడనిచ్చేవాడు కాదు.

ఆ ఇద్దరు ఆడపిల్లల్ని తన రెండుకళ్ళలాగా చూసుకొన్నాడు. ఎంతో అల్లారుముద్దుగ పెంచి పెద్దవాళ్లను చేశాడు.

ఆ యిద్దరు ఆడపిల్లల పెళ్లిళ్ళకోసరం తన ఆస్తిఅంతా ఖర్చుచేశాడు. శాంతకు దొరికిన సంబంధం కాస్త తక్కువ సంబంధమని, బీదవాళ్ళని బాధపడ్డాడు. అందువల్ల సుగుణను కాస్త గొప్పయింటికి, బాగా తినగుడవ వున్నయింటికి ఇవ్వాలని ఎంతో ప్రయత్నించేశాడు, ఆవిధంగానే యిచ్చాడు.

సుగుణ అత్తవారింటికి వెళ్ళటం అక్కడ బాధలు పడు తూవుండటం ఆయనగారి మనస్సుకు ఎంతో బాధ గలిగింది. ఆ బాధతోనే ఎంతో కుమిలిపోతూ వుండేవాడు. తరువాత కాంత పెండ్లిటి చనిపోవటంతో ఆయనగారు మనోవ్యాధి తోనే మంచం పట్టాడు, తరువాత ఒక నెలరోజులకు చనిపోయాడు

సుగుణ కృష్ణుణ్ణి తన యింటికి తీసుకవచ్చి అయిదు సంవత్సరాల నుంచి ఎన్నో మాటలు అత్తమామలతోటి. భర్తతోటి మరుదులతోటి ఆడబిడ్డలతోటి పడుతోంది. ఆయిం ముందే వాళ్ళంతా కృష్ణుణ్ని నానామాటలు అంటూవుంటే, కొడుతూవుంటే భరించి వూరుకునేది మనస్సులో ఎంతో ఆవేదనపడేది, వంటరిగా కూర్చొని ఏడ్చేది

ఇంటోవాళ్ళు కృష్ణుడికి తొడుక్కోవటానికి గుడ్డలు కూడా కుట్టించేవారు కాదు. వాడు "పిన్నీ! నాకు గుడ్డలే" అని అడిగితే "కుట్టిస్తాను- బాబూ!" అని సమాధానం చెపుతూవుండేది సుగుణ.

తోడి పిల్లలంతా కొత్త చొక్కాలు, లాగులు తొడు క్కొని ఎంతో ఉల్లాసంగ పండుగలు చేసుకుంటూ వుంటే "పిన్నీ—— నాకు గుడ్డలు కుట్టించవూ!" అని అడిగేవాడు.

"ఈ శాప వంతుక్కు కట్టిస్తాలే బాబూ" అని సమాధానం చెప్తూవుండేది.

'ఎప్పుడడిగినా ఈ శాప ఈ శాప అంటావు— కట్టించనని చెప్పరాదే' 'అంటే వాడు ఎంతో మారాం చేస్తూవుంటే సుగుణ తన అశక్తతకు ఎంతో కుమిలిపోయేది "తప్పక కట్టిస్తా బాబూ" అని చెప్పేది.

కృష్ణుడిచేత తన మనుదులు, ఆడబిడ్డలు అడ్డమైన చాకిరి చేయించుకుంటూ నానా మాటలు అంటూ వుంటే సుగుణ మనస్సులో ఎంతో బాధపడేది.

ఎవ్వరైన కృష్ణుడు అందరితోటి భోజనానికివస్తే పంక్తిన కూర్చోనిచ్చే వాళ్లుకాదు. ఎక్కడో చివర్నకూచుంటె అందరు తిన్నాక. మిగిలిన ఎంగిలంతా వాడికంచంలో వేసేవాళ్లు వాడు "నేను తిననూ" అంటే "తినకపోతే తంతాం వెధవా" అని భయపెట్టేవారు ఒక్కొక్కప్పుడు "తింటానికి తిండిలేకపోయినా వెధవకు రాజసం జాస్తి" అనేవారు. వాడు పిన్నివైపు బిక్క ముఖం వేసి చూచేవాడు. "తిను బాబూ! తప్పలేదు" అనేది. వాడు తింటూవున్నంత సేపు అందరు వాడిచాయితే చూచేవారు. "వీడికి పక్రితిరోజు సేరు బియ్యం కావాల్సిందే...... తెగతింటాడు వెధవ... తేరగ వచ్చిందని..." అనేవాళ్ళు.

'వృద్ధ్యాసి! వస్తే తినకేంచేస్తాడు... ముష్టివెధవ... వాడిబాబుగాడి సొమ్మంది ఇక్కడతినటానికి...' అనిఎన్నో తిట్టిపోసేవారు.

ఈ మాటలన్నీ సహించి సుగుణ ఎంతో ఓపిగ్గా కాపురంచేస్తోంది. నిజంగా సుగుణ సుగుణాలగని. అందాల ధరణి. ఆమె అంత పొడుగుకాదు. మరీ పొట్టికాదు. ప్ర రాసిగా వుంటుంది. ముఖం అంత గుండ్రంగా వుండదు. మరీ కోలగ వుండదు. మధ్యస్తంగా వుంటుంది. అందమైన వాలు కళ్లు పొడగాంటి కోసైన ముక్కు— అంథమైన చిన్న చుబుకం— మన్మథ బాణాల్లా ఎంతో వొంపుతిరిగిన కను బొమలు— ఆమె ముఖం ఎంతో ఆకర్షణీయంగ వుంటుంది. సన్నని నడుం.. సొంపైన అవయవాలు... చూచేవాటికి దేవతా స్త్రీ అనే భ్రాంతి గొలుపుతూ వుంటుంది.

పల్లెత్తి ఒక్కమాట గూడ ఇతరులను అనేది కాదు. ఆ ఇంట్లో ఎంతో మెలుకువతో ప్రవర్తిస్తోంది.

ఇంటి చాకిరంతా తెల్లవారుజామున నాలుగుగంటలకు లేచి రాత్రి పదకొండు గంటలదాకా చేస్తూవుంటుంది. అయినా అత్తమామ, మెచ్చుకునేవారు కాదు. ఎప్పుడూ ఏవో మాటలు, ఆమెనో కృష్ణుణ్ణో అంటూవుండేవారు.

మొదటి రోజుల్లో ఎన్ని మాటలన్నా తనకుకానట్లు విని వూరుకునేది. తిరువాత ఆమెకు ఆ మాటలవల్ల ఎంతో బాధ కలిగింది. దానితో మనోవ్యాధి పట్టుకుంది క్రమంగా చిక్కి శల్యమైపోయింది. వెనకటి అందచందాలు తగ్గాయి. శరీరపోషణ తగిన విధంగా లేకపోవటంవల్ల చాలా కాంతి విహీనంగా తయారైంది. కాని కళ్ళల్లో మాత్రం ఓవిధమైన వెలుగు ప్రస్ఫుటంగా కనిపిస్తూ వుంటుంది,

వంటరిగా కూర్చొని అత్తమామలు అనే మాటలు నెమరువేసుకొని ఏడ్చేది కృష్ణుడు పెద్దవాడైతే తనకష్టాలు తీరిపోతాయనుకునేది ఆ ఆశతోనే జీవిస్తోంది.

సుగుణ తన మరదులు, ఆడబిడ్డలు స్కూలుకువెళ్ళుతూవుంటే కృష్ణుణ్ణిగూడా వెంటతీసుకు వెళ్ళమనేది. వాళ్ళు నిర్మొగమాటంగా "ఆ దరిద్రుడు మా వెంట దేనికి?" అనేవారు,

మామగారు '‘ఆ వెధవకు చదువేం వస్తుంది? పెట్టే తిండే దండుగ అనుకుంటూవుంటే పైన చదువులుగూడానా? మావల్లకాదు" అనేవాడు.

"ఒక జీతగాణ్ణి తగ్గించి గొడ్లదగ్గర పెడతీయటానికి, గొడ్లను కాయటానికి కృష్ణుణ్ణి పెట్టండి" అని తన అత్తగారు

భక్తితో అనేక పర్యాయాలు చెప్తూవుండటం సుగుణ చాలాసార్లు విన్నది.

అప్పూరు ప్రైమరీ స్కూలు హెడ్మాష్టరు గారు చాలా మంచివాడు. ఆయనగారి పెద్దకూతురి పేరు ఉమ. ఆమె చాలామంచిది. ఆమె భర్తకూడా ఆ స్కూల్లోనే పని చేస్తున్నాడు. ఆ అమ్మాయి తరుచుగా సుగుణ వాళ్ళయింటికి వస్తూవుండేది. అలా వస్తూవున్న సమయంలో ఒకనాడు ఇంట్లో ఎవరూలేరు. సుగుణ ఒక్కతేవుంది. అందువల్ల ఆ అమ్మాయిని తనదగ్గర కూర్చోపెట్టుకొని కృష్ణుని సంగతంతా చెప్పింది. "అమ్మాయీ! మీ నాన్నగారితో ఏమి మాటలో చెప్పి ఈ దుర్భాగ్యుడికి నాలుగు ముక్కలు వచ్చేట్టు చూడు తల్లీ! చచ్చి నీ కడుపున పుడతాను..." అని ఎంతో బ్రతిమాలింది. ఆ అమ్మాయి చాలా దయగలపిల్ల. అందువల్ల "దానికేం భాగ్యం అక్కా! నేను మా నాన్నతో చెప్తానులే" అంది. ఆ విధంగానే ఇంటికి వెళ్ళి తండ్రితో చెప్పింది. తండ్రి "పంపించమను— తప్పకుండా శ్రద్ధగా చెప్తానన్నా"నని చెప్పు అన్నాడు.

ఆ అమ్మాయి సుగుణతో వచ్చి చెప్పింది. ఆనాటి నుంచి కృష్ణుణ్ణి బళ్ళోకి పంపిస్తోంది. రెండేళ్ళబట్టి వాడు బళ్ళోకి పోతున్నాడు.

కృష్ణుడు మంచి చురుకైన పిల్లవాడు. అందువల్ల పంతులుగారు చెప్పిన విషయాలన్నీ శ్రద్ధగ వినేవాడు. ఆ విన్న విషయాలను మళ్ళీ అక్కడే తప్పచెప్పతూవుండేవాడు. కనుక ఆ స్కూలులోవున్న ఉపాధ్యాయులందరికీ వాడిమీద ప్రేమ, దయకలిగింది. వాళ్ళే తలో పెన్సలు- కాగితం-కలం-పుస్తకం కొనియిచ్చేవాళ్లు అవి కృష్ణుడు ఇంటికి తీసుకవస్తే, అవే తమకు కావాలని సుగుణ మరుదులు ఆడబిడ్డలు మారాం చేసేవారు. ఇచ్చిందాకా వదలిపెట్టేవారు కాదు.

ఆవిధంగా సుగుణ కృష్ణుడికోసం ఎన్నో కష్టాలను భరిస్తోంది. "ఎప్పటికైన తన కృష్ణుడు పెద్దవాడు కాకపోతాడా? వృద్ధిలోకి రాకపోతాడా?" అని ఆమె వాణ్ణిగురించి అనేక కలలు కంటోంది.

* * *

వెనకటి సంఘటనలన్నీ గుర్తుకురావటంవల్ల సుగుణ కళ్లవెంట నీరుకారుస్తోంది. కృష్ణుడి శరీరంమీద చేయి వేసింది. శరీరమంతా మండిపోతోంది "అయ్యో! వైద్యుడికైనా చూపిస్తె బాగుండును...... అనుకుంది." ఆ విషయాన్నే ఆలోచించుకుంటోంది. అంతలోనే అత్త ఆడబిడ్డలు అంతా ఇంటికివచ్చారు. ఆమె వాళ్లువచ్చినసంగతినే గుర్తించలేదు.

"అయ్యో! పొద్దుగవూట ఇంట్లో దీపమన్నా

మట్టించకుండా ఈ కోడలు తల్లి పిత్తానాంకి ఎక్కడికి పొయిందో ?" అని అంటూావుండటం వినిపించింది

"ఇక్కడే వున్నాను అత్తా" అంటూా గదిలోయించి బయటకు వచ్చింది

"ఇక్కడేం చేస్తున్నావు? దీపం ముట్టించకుండా ?" అంది ఎంతో విసురుగా...

"కృష్ణుడికి......జ్వరం"

"ఏమిటీ" అంది, దీర్ఘాలుతీస్తూ, అత్తగారు.

"జ్వరం"అని సుగుణసమాధానంచెప్పింది శాంతంగా,

"అయితే" అత్తగారు విసుగ్గా అంది.

"వాడిదగ్గర కూర్చున్నా"

"దీపమున్నా ముట్టించకూడదా !"

"ఏదో మరిచిపోయానండీ, అత్తగారూ"

"నీకన్నీ మరుపే......"

"లేదండీ......"

"ఏం లేదు, నీముఖం ...? వొళ్ళు బద్ధగించి అని చెప్పరాదూ?"

"అది కాదండీ... పిల్లవాడికి వళ్లుమండిపోతోంద"

"అన్నీ వేషాలు"

"నిజమేనండీ"

"నాకన్నీ తెలుసులే.. ఈమధ్య నీవేషాలన్నీ చూస్తూనే వున్నాగా...?" అని ఇంకా ఏమేమో అంటోంది.

ఇక ఏంచెప్పినా లాభంలేదని, సుగుణ లోపలికి వెళ్ళి, దీపాలు ముట్టించి, మడికట్టుకోని వంటచేస్తోంది.

అంతలో మామగారు వచ్చారు. "వంట అయిందా?" అని అడిగారు.

"కోడలమ్మగారు ఇప్పుడే మడి కట్టుకుంది......"

అత్తగారి సమాధానం.

"ఇందాకటినుంచి ఏం చేసింది......?"

"కొడుక్కట జ్వరమట!"

"అయితే......?"

"వాడిదగ్గర కూర్చుందట......!"

"ఈకొంపకి అష్టమైన వాళ్ళంతా పోగయ్యారు. అన్నీ దొంగవేషాలు దొంగరోగాలు..." అని తిట్టారు. "అమహానుభావుడు..."

అంతలోకి సుగుణవచ్చి "వంట అయింది...మడికట్టుకోండి" అని చెప్పింది.

అంతా భోజనాలు చేసేరు. తరువాత సుగుణభర్త తినిపోయిన విస్తరిలో తనకు వడ్డించుకోని, విస్తరిముందు

కూర్చుంది. ముద్దకలిపి నోట్లోపెట్టుకోబోయింది. అయిదు సంవత్సరాలక్రిందట చనిపోయిన అక్క ఒక్కసారిగా జ్ఞాపకం వచ్చింది.

"చెల్లీ! నాకిల్లవాడు......" అని అంటూవున్నట్లు తోచింది.

వెంటనే సుగుణ కళ్ళవెంట అశ్రుబిందువులు రాలటం ప్రారంభించాయి. ఆమె శరీరమంతా వణికిపోయింది.

"అక్కా......అక్కా......అక్కా" అని మూడు సార్లు అనుకుంది, ఎంతో ఆవేదనతో

తనచుట్టూ చూచుకుంది. ఎవరూలేరు. తానొక్కతే విస్తరిముందు కూర్చొనివుంది. కృష్ణుని శరీరంనిండా వున్న దెబ్బలగుర్తులు, గుర్తుకువచ్చాయి. ఇక అన్నం తినబుద్ధి పుట్టలే. విస్తరి మలిచేసి చేయికడుక్కుంది; వంటయిల్లు శుభ్రంచేసి, గొడ్లకు మేతవేసి, తలుపులన్నీ గొళ్ళాలు పెట్టింది. అప్పటికే యింట్లోఅంతా నిద్రావస్థలో వున్నారు, అందువల్ల నెమ్మదిగా కృష్ణుడు పడుకున్న మంచం దగ్గరికి వెళ్ళింది. వాడి శరీరాన్ని తాకిచూచింది. జ్వరం ఇంకా తీవ్రంగా వుంది. వాడి శరీరంనిండా కప్పినగుడ్డలేదు. ఎవరో తీసుకపోయారు. అటు, ఇటు దానికోసం చూచింది. ఆ గుడ్డను 'రామి' తీసుకొని, తన కాళ్ళక్రింద మెత్తగా వుండేట్లు పరుచుకొని పడు

కున్నాడు.

తన కృష్ణునికి కప్పుకోవటానికి గుడ్డకూడా లేకుండా, ఎంతో హీనంగా వుండటం ఆమెకు చాలా బాధకలిగింది. "అయ్యో! కృష్ణుడా...... నీవు ఈ ఇంట్లో ఎన్ని బాధలు పడుతున్నావురా? తండ్రీ! ఈ నీబాధలకు అంతం ఎప్పుడో!" అని అనుకుంది.

ఇల్లంతా వెతికిచూచింది. ఎక్కడా ఏమీ కనుపించ లేదు. తనపెట్టె తెరిచింది. అందులో తనకు, తన తండ్రి పెళ్ళినాడు పెట్టిన కొర్నాటి జరీచీర కనుపించింది. దాన్ని పైకి తీసింది.

అదంటే ఆమెకు ఎంతో ప్రాణప్రదం. అలాంటి చీర తనతల్లి కట్టుకుంటూ వుండేదట. అందువల్ల తండ్రి ఆమెకు అలాంటి చీర తెచ్చాడు. ఆ చీర కూతురు కట్టుకొని తిరుగుతూవుంటే తండ్రి ఎంతో, సంతోషపడేవాడు. "మాతల్లి ఈ చీర కట్టుకుంటే అచ్చం తల్లిలాగే వుంటుంది" అనేవాడు.

ఆ చీరను కృష్ణునికి, తీసుకవెళ్ళి కప్పింది. అప్పటికి జ్వరం తీవ్రరూపం దాల్చింది. కృష్ణుడు కలువరిస్తున్నాడు. "పిన్ని......" అంటూ, "రాముా... నా జోలికిరావు కదూ...—" అని ఇంకా ఏమిమో వాగుతున్నాడు.

"కృష్ణుడూ! మాట్లాడకుండా పడుకో," అని చెప్పింది

సుగుణ. కానీ నాడు వాడిఅవస్థలోవున్నాడు. ఆమె చెప్పిందేదీ వినిపించుకునే పరిస్థితిలో లేడు.

సుగుణకు కృష్ణుణ్ణి ఏ వైద్యుడికన్నా చూపించాలను కుంది. తాను ఏంచేయగలనని కూడా భావించింది. వెంటనే ఏదో ఆలోచన తట్టింది. భర్త పడుకోనివున్న గదిలోకి వెళ్ళింది. అతను గాఢనిద్రావస్థలో వున్నాడు.

"ఏమండీ!" అని పిలిచింది, భర్తను.

అతను పలుకలేదు.

"మిమ్మల్నే..."

"..........."

"మిమ్మల్నేనండీ...పిలిచేది..." అని చేయిపట్టుకొని లేపింది. ఆయనగారు లేచి కూర్చున్నాడు.

"ఎందుకూ లేపావు?"

"పనుందండీ!"

"ఏంపని...?"

"కృష్ణునికి..."

"ఏమిటి కృష్ణుడికి...?"

"జ్వరం...... తీవ్రంగా వుంది"

"నన్నేం చెయ్యమన్నావు!—"

"వైద్యుణ్ణి......"

"ఈ రాత్రి వైద్యుడూ లేడు గీద్యుడూ లేడు పడుకో..."

"పాపం వాడు ఎంతో బాధ పడుతున్నాడండీ..." అని చెప్పి ఎంతో జాలిగా వేసుకుంది... ..

"నాకేం తెలియదు.... నాన్నను లేపి కనుక్కో" అని చెప్పి పడుకున్నాడు మళ్ళా.

సుగుణకు భర్త ప్రవర్తన ఎంతో అసహ్యాం వేసింది. కోపం వచ్చింది. ఏం చేయగలదు ఆమె....?

మామగారి గదిముందు వెళ్ళి నిలుచుంది. రెండుమూడు పర్యాయాలు వారిని లేపుదామని ప్రయత్నం చేసింది. కాని మామగారి పరిస్థితులు తెలుసుగాబట్టి "లాభం" లేదని వెళ్ళిపోయి, కృష్ణుడి మంచంమీద పడుకుంది. ఆ రోజంతా తిండి లేకపోబట్టి సుగుణకు కడుపులో మాడుతోంది. నిద్ర పట్టటం లేదు. ఆమె ఆలోచనా తరంగాలు పరిపరి విధాలుగా పోసాగాయి.

"తాను....ఏం చేయగలదు? తన పరిస్థితులకు తానే అసహ్యించుకుంది. జాలిపడ్డది.... సిగ్గుపడ్డది.... తన అత్త మామల ప్రవర్తన.... భర్త ప్రవర్తన...." తనకెంతో ఆవేదన గలిగించింది........ తరువాత కృష్ణుణ్ణి తన దగ్గరకు లాక్కుంది. వాణ్ణిగట్టిగా కౌగిలించుకుంది వాడి శరీరమంతా వాగలు తేలిపోతున్నాయి.... దుఃఖం పొర్లుకొచ్చింది...

"కృష్ణుడూ....." అని తన మనస్సులోనే నాలుగు సార్లు అనుకుంది, అలాగే ఏ రాత్రికో ఆకలిమంటల్లో నిద్రపోయింది.

సుగుణ మామగారిపేరు విశ్వపతిగారు, అత్తగారిపేరు నాంచారమ్మ. వారికి నలుగురు మగపిల్లలు అయిదుగురు ఆడపిల్లలు. సుగుణ భర్త పేరు శంకరం. అందరికన్నా ఇంట్లో పెద్దవాడు. అతనికి ముప్పై సంవత్సరాల వయస్సుంటుంది. అంత ఎక్కువగా చదువుకోలేదు. ఇంటి పనులు, వ్యవసాయపు పనులు చేస్తూవుంటాడు. తండ్రిమాటకుగాని తల్లి మాటకుగాని ఎదురు చెప్పడు. భార్య ఏదైనా తనతల్లిని గురించిగాని, తండ్రిని గురించిగాని చెపితే ఆమెనే కొప్పడే వాడు. "అమ్మా— నాన్నా చెప్పినట్లు విని ఇంట్లోవుంటే వుండు. లేకపోతే నీయిష్టం వచ్చిన చోటికి పో" అంటూ వుండేవాడు. అందువల్ల సుగుణ ఏ విషయమూ భర్తతో చెప్పేదికాదు. శంకరం తరువాత వాడి పేరు శశిధరరావు. బి. ఏ. పరీక్ష అయినాడు అతనికి ఒక జిల్లా జెడ్జిగారి కూతుర్ని ఇచ్చారు. అతను హైదాబాదులో ఇన్‌కంటాక్సు ఆఫీసులో వుద్యోగం చేస్తున్నాడు. అతనంటే ఆయింట్లో అందరికీ చాలా గౌరవం.

శశిధరరావు అత్తగారినిగురించి, మామగారినిగురించి ఎంతో గొప్పగ చెప్పకునేవారు.

సుగుణ తన పిల్లవాడికి తగిన పిల్లకాదని, తన దురదృష్టంకొద్దీ ఆ పాడు సంబంధం దొరికిందని సుగుణ ముందే. ఆమె తల్లినీ తండ్రినీ నానామాటలు అంటూ వుండేవారు. అయినా సుగుణ ఎంతో ఓపికగా, మెళుకువతో ఆ ఇంట్లో మెదుల్తోంది.

శశిధరరావు తరువాత ముగ్గురు వరుసగా ఆడపిల్లలు. ఆ ముగ్గురికీ పెళ్ళిళ్లు జరిగాయి. వాళ్లు అత్తవారిళ్ళల్లోకన్నా పుట్టింట్లోనే ఎక్కువగా వుంటూవుంటారు.

ఆ ముగ్గురు ఆడపిల్లల తరువాత ఒక మగపిల్లవాడు. తరువాత మళ్ళీ ఇద్దరు ఆడపిల్లలు— అందరికన్నా చివరివాడు రాము. ఆ ఇంట్లో వాడు అందరికీ గారాబుపట్టి— వాడు ఆడింది ఆట— పాడింది పాట వాడు 'కొండమీద వున్న కోతికావాలంటే' తీసుకరావాల్సిందే.

రాము— కృష్ణుడు ఇద్దరు ఒక ఈడువాళ్ళే—

రాముడి తల్లితండ్రి అంతావున్నారు— కృష్ణుడో బికారి... దరిద్రుడు...

ఆ ఇద్దరు పిల్లలమధ్య ఎంతో తేడావుంది. అదంతా అదృష్టంలో వున్న తేడా!

విశ్వపతిగారు చాలా పిసినిగొట్టు తనను, తన భార్యపిల్లలను తప్ప ఇతరులకోసరం ఒక్క దమ్మిడీ ఖర్చు

పెట్టడు. ఆయనగారి భావాలు, కార్యక్రమాలు, ఆచరణలు. ఆచారాలు అవోలా వుంటాయి. బాగా ఆస్తివుంది. వడ్డీ వ్యాపారంకూడా చేస్తూవుంటాడు. ఎప్పుడు ఇనపెట్టెతాళం చెవులు మొలకు తగిలించుకొని తిరుగుతూ వుంటాడు. పిల్లికి బిచ్చం పెట్టటమంటే ఆయన కిష్టంవుండదు. భార్య నాంచారమ్మ అన్నివిధాలా భర్తకుతగింది దయాదాక్షిణ్యాలు, జాలి, కరుణ అనేవి వాళ్ళదగ్గర మచ్చుక్కూడా లేవు

డబ్బుకలవాళ్లు కాబట్టి జెడ్జిగారి వియ్యంకుడుకాబట్టి, ఆవూళ్ళో వాళ్లందరికి వాళ్ళంటే ఒకవిధమైన భయం. కాని చాటుచాటున వారి పిసినాసితనాన్ని గురించి, జగడాల మారితనాన్ని గురించి తలోవిధంగా అనుకుంటూవుంటారు. ఎదురుగా మాత్రం ఏమి అనరు.

సుగుణ ఆ ఇంట్లో అనుభవించే బాధలు అందరికీ తెలుసు. వ్రతివాళ్లు సుగుణ మంచితనాన్ని ఎంతో మెచ్చుకుంటారు. "పాపం సుగుణమ్మ మహా ఇల్లాలు, ఆ తల్లి గాబట్టి ఆ రాక్షసుల క్రింద నెగ్గుతోంది— ఎంత ఓపిక...! ఎంత శాంతం...! ఎంత దయ...? నిజంగా ఆమె సీతలాంటి చల్లటితల్లి" అని అంటూవుంటారు.

ఇది ఆ వూరి పరిస్థితి— ఆ ఇంటి పరిస్థితి.

సుగుణకు తెల్లవారు జామున ఎప్పుడో నిద్రపట్టటం

చేత. శాస్త్ర పొద్దెక్కేంతవరకు లేవలేదు. అందువల్ల అత్తగారు "ఏమమ్మోయి! ఎంత పొద్దెక్కిందో చూడు అలా జాంపొద్దెక్కిందాక పడుకుంటే, మనమేమన్నా మహారాజులమా? లే—" అంటూ గదిమసాగింది.

సుగుణ ఉలిక్కిపడి లేచింది. "అయ్యో అత్తగారూ ఏదో పొరపాటున పడుకున్నాను......" అని ఏమేమో చెప్పబోయింది.

"ఆ డేమిటే సుగుణా! ఆ పట్టుచీర కట్టావు. అయ్యో! అలా ఖరీదైన చీరలు పాడుచేసుకుంటారా? పిల్లవాడిమీద ప్రేమవుంటే మాత్రం ఆ విధంగా చీర పాడుచేసుకుంటారా! నీదంతా మహా విడ్డూరమేవ్..." అని ఓ లత్తు వసిగింది, నాంచారమ్మగారు.

"కాదత్తా.. గుడ్డలులేక..." అంది సుగుణ మెల్లగా.

"గుడ్డలు లేకపోతేమాత్రం... పట్టుగుడ్డలా? నీగ్గాంగ సరిపోయింది. మేమూ పిల్లల్ని కన్నాం; పెంచాం; పెద్దవాళ్ళను చేశాం... ఇలా కాపరం చేసేమా!" అని ఇంకేమేమో సాధించింది

సుగుణకు అత్తగారి స్వభావం తెలుసు కాబట్టి, అక్కడినుంచి వెళ్ళిపోయి, తనపనులు చేసుకోవటం మొదలెట్టింది.

మధ్యాహ్నం రెండు గంటలదాకా మడికట్టుకొని

వంటలు చేయటం, అందరికి వడ్డించటంతోనే సరిపోయింది. అందువల్ల ఆమెకు కృష్ణుకి సంగతి పట్టించుకునే అవకాశం చిక్కలేదు. కనుక ఆమె ఆపనులన్నీ పూర్తిచేసుకొని కృష్ణుడి దగ్గరికి వచ్చింది.

"కృష్ణుడూ!" అని పిలిచింది.

కృష్ణుడు మూలుగుతూ "ఏం పిన్నీ?" అని అడిగాడు.

"నీ శరీరం ఎట్లావుంది, బాబూ!" అని అడిగింది ఎంతో ఆత్రంగ సుగుణ......

"వళ్ళంతా విరగ్గొట్టినట్లుంది. నోరంతా చేదుగా వుంది. కళ్ళు తిరుగుతున్నాయి, డోకువస్తోంది."

"లేచి ముఖం కడుక్కో బాబూ!"

"లేవలేను పిన్నీ"

"నేను లేపుతాను తిన్నగా ఓపిక చేసుకోవాలి!" అని వాణ్ణి పట్టుకుంది. ఇంకా జ్వరం జారలేదు. శరీరమంతా సెగ కాగిపోతోంది, పొగలు వెళ్తున్నాయి. "అమ్మయ్యో! ఎంత జ్వరం!" అనుకుంది.

ఏదోవిధంగా ముఖం కడిగించి మళ్ళీ పడుకోబెట్టింది. "అన్నం తింటావా కృష్ణుడూ?" అంది మమకారం కొద్ది, ఆ జ్వరంలో అన్నం పెట్టకూడదని తెలిసివుండి కూడా.

"వొద్దు పిన్నీ..."

"కాస్త ఎంగిలిచెయ్యరాదు బాబూ..."

"నాకువద్దు పిన్నీ..."

"అయితే సరే పడుకో- నేను భోజనంచేసి ఇప్పుడే వస్తాను." అంది.

"నాదగ్గరే కూర్చో పిన్నీ- ఎక్కడికీ పోబోకు పిన్నీ" అన్నాడు.

"ఇప్పుడే వస్తా బాబూ" అని లేచిపోయింది.

ఆమె అన్నంముందు కూర్చుంది. కాని సరిగ్గా తిన బుద్ధిపుట్టలేదు ఆ తరువాత మామగారి దగ్గరికి వెళ్లినిల్చుంది.

"ఏం—వచ్చావు?" అని అడిగాడు వెటకారంగా

"కృష్ణుడి వళ్లు మండిపోతోంది"

"అయితే—"

"ఎవరినైనా వైద్యుణ్ణి పిలిపించండి..." అని అడిగింది సుగుణ ఎంతో దీనంగా ముఖంపెట్టి.

"కాస్తాకూస్తా రోగాలకు వైద్యులు దేనికి..."

"చాలా జ్వరంవచ్చింది...ఎంతో తీవ్రంగావుంది..."

"ఫరవాలేదు— అదే పోతుంది—"

"కాదండీ-పిల్లవాడు చాలా బాధపడుతున్నాడు-"

"లంకణం పరమౌషధం- అన్నారు, పెద్దలు- తెలిసిందా?" అని వెకిలగా నవ్వుతూ అన్నాడు మళ్ళీ

ఇక లాభంలేదని సుగుణ వెళ్లిపోయి, కృష్ణుడిమంచం దగ్గర కాసేపు కూర్చుంది. వాడి ముఖం అంతా గుంజుకుపోయింది. కళ్ళు లొట్టలుపడి కాంతి విహీనంగా వున్నాయి. శరీరమంతా కాలిపోతోంది.

"ఓ భగవంతుడా! మా కృష్ణుడు దిక్కులేనివాడు. జ్వరంతో బాధ పడుతున్నాడు. వాణ్ణి రక్షించే భారమంతా నీదే......నిన్నే నమ్ముకున్నాను". అని మనస్సులోనే ఏమో ఏమో అనుకొంటోంది సుగుణ. ఆమె కళ్లవెంట నీరు జొట జొట రాలజొచ్చాయి. ఆకన్నీటి బిందువులు కృష్ణుడిమీద పడ్డాయి. అందువల్ల వాడు లేచాడు. "ఏం పిన్నీ అలాఏడుస్తున్నావు? నావల్ల ఏమైనా తప్పుజరిగిందా? చెప్పు........" అన్నాడు ఎంతో ఆత్రంగా.

సుగుణ సమాధానం చెప్పకుండా మౌనంగా వూరుకుంది. కన్నీరు తుడుచుకుంటోంది.

"ఏం పిన్నీ మాట్లాడవేం?"

"............"

"నిన్నే పిన్నీ—"

"నీవల్ల ఏమీ అపచారం జరుగలేదు—"

"మరి దేనికి ఏడుస్తున్నావు?"

"ఊరికేనే— ఏదో గుర్తువచ్చి......"

"నాకు ఆ సంగతి చెప్పవా పిన్నీ—?"

"ఏమీ లేదు బాబూ- నీవు మాట్లాడకుండా పడుకో"

"నాకు చెప్పకూడదా పిన్నీ—?"

"ఏముంది బాబూ చెప్పటానికి!"

"అయితే ఎందుకాలా కన్నీరు కారుస్తున్నావు—?"

"ఊరికేనే" అన్నాగా

వెంటనే ఇంట్లో పనులన్నీ గుర్తువచ్చినందువల్ల సుగుణ లేచిపోయింది. ఆ రాత్రిగూడా సుగుణ అన్నిపనులు చేసింది. తానుమాత్రం భోజనం చెయ్యలేదు-- చాలా రాత్రిపోయిం తరువాత మళ్ళీ కృష్ణుడిదగ్గరికి వచ్చింది.

వాడు స్పృహతప్పి పడివున్నాడు ఏవో పిచ్చిమాటలు కలవరిస్తున్నాడు. ఒకప్పుడు "పిన్నీ-" అంటున్నాడు. మరొకప్పుడు "రామూ మనమిద్దరం స్నేహంగా వుందాం" అంటున్నాడు. "ఇక నువ్వు చెప్పినట్లు వింటాను— కొట్టకురా! నావళ్లు మండిపోతుందిరా" అని అంటున్నాడు.

ఆ మాటలన్నీ విని సుగుణ, ఆమెకు ఎంతో భయం వేసింది. తెల్లవారిం తరువాత త్వరైన వైద్యుణ్ణి పిలుచుకు రావాలనుకుంది. లేకపోతే రోగం ముదిరిపోతుందని భయం వేసింది. అందువల్ల చాలా రాత్రికి ఏవేవో అనుకుంటూ నిద్రపోయింది.

సుగుణ కాపురానికొచ్చి పదిసంవత్సరాలైంది సంతానం కలుగలేదు. మొదటి అయిదు సంవత్సరాలు, తనకు పిల్లలు కావాలని, తాను అందరిలా పిల్లలతల్లి కావాలని, ఎంతో ఆవేదనపడ్డది, కాని ఆ కోరిక భగవంతుడు పూర్తి చెయ్యలేదు. ఆ తరువాత అక్క చనిపోయింది. కృష్ణుణ్ణి తాను తీసుకరావటంతో, ఇక తనకు పిల్లలులేరనే సంగతే మరచిపోయింది తనకు సంతానం లేకపోయినా ఫరవాలేదనుకుంది. తన అక్కకొడుకు... కాదు తనకొడుకు... అక్క కొడుకు, కృష్ణుడే వేయికాలాలపాటు బ్రతికితే అంతేచాలనుకుంది. ఇక తనకుసంతానం లేకపోయినా ఫరవాలేదనుకుంది, వాడిపైనే తన పంచప్రాణాలు పెట్టుకోని బ్రతుకుతోంది.

ఆ మర్నాడుగూడా రెండు జాములవరకు, సుగుణకు ఇంటిపనితోనే సరిపోయింది. అన్నీ పనులు పూర్తిచేసుకోని మళ్లీ కృష్ణుడి గదిలోకివచ్చింది, వాడి ముఖమంతా నల్లబడిపోయింది, గొంతుక హీనస్వరం పడింది. ఏదో అంటున్నాడు, అనాలని ప్రయత్నం చేస్తున్నాడు. కాని ఆ మాటలు పైకి పెగిలిరావటం లేదు. ఆమెకు దుఃఖం పొర్లుకవచ్చింది. వెంటనే మామగారి దగ్గరికి వచ్చింది. "ఏమండీ—" అని ఎంతో ఆత్రంగా పిల్చింది.

"ఏం?" అని మాత్త సరిగా అడిగాడు.

''పిల్లవాడికి......''

''ఏం ఫరవాలేదు—''

''వైద్యుణ్ణి పిలుచుకరాండి. మీ కాళ్ళు పట్టుకుంటాను—''

''ఏమీ అవసరంలేదు— ఆదే పోతుంది—''

''కలవరింతలు- పిచ్చిమాటలు- పిచ్చిచూపులు—''

''స్వైత్యం చేసి వుంటుంది— అంతే—'' అన్నాడు ఎంతో తేలికగా- సుగుణ శరీరమంతా ఒక్కసారి మండి పోయింది. ''మీ పిల్లవాడైతే ఆలాగే వూరుకుంటారా!'' అని ఒక్కపోలి కేక వేసింది ఆమె కళ్ళు చింతనిప్పల్లా ఎఱ్ఱగా మండిపోతున్నాయి. శరీరమంతా వణికిపోతోంది, ఇక అక్కడ నిలుచోలేక పోయింది, ఇల్లుదాటి బజార్న పడ్డది. జంగం శరభయ్య అప్పుడే వాకిట్లో ఎవరితోనో మాట్లాడు తున్నాడు, అతను ఆ వూళ్ళోనేగాక, ఆ చుట్టుపట్ల పదిగ్రామాల్లో పేరుపడ్డ వైద్యుడు అతని హస్తవాచి చాలా మంచిది. డబ్బు ఇవ్వాంది మాత్రం సానమీద చెయ్యివెయ్యడు.

శరభయ్య సుగుణను చూచాడు. ఆమె ఆకారాన్ని చూచేప్పటికి అతనికెంతో భయం వేసింది. ఆమె ఎప్పుడూ బజారుకు వచ్చేదికాదు. ''ఎందుకాలా వచ్చిందా!'' అను కున్నాడు. వెంటనే ''ఎందుకు తల్లీ వచ్చావు!'' అని ఎంతో ఆప్యాయంగా అడిగాడు.

"నీ దగ్గరికే వచ్చాను బాబాయి—" అంది.

"నీవెందు కొచ్చావమ్మా! ఎవర్నన్నా పంపించక పోయావా? నేనే వచ్చేవాణ్ణే." అన్నాడు.

"మీతో చాలా అవసరమైన పనుండి వచ్చాను"

"ఏమిటి—చెప్పమ్మా!" అన్నాడు ఎంతో ఆత్రంగా.

"మా కృష్ణుడికి జ్వరం" అనిమాత్రం అనగలిగింది. ఇక మాట్లాడలేకపోయింది వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది.

"ఎందుకాలా ఏడుస్తావమ్మా! అసలు సంగతి చెప్పు—"

"వెళ్లొదాం పదమ్మా!" అన్నాడు.

సుగుణ శరభయ్యను సరాసరి కృష్ణుడున్న గదిలోకి తీసుకవెళ్ళింది. శరభయ్య రోగిని పరీక్షగా చూచాడు. తరువాత నాడిపరీక్ష చేశాడు. ఏదో దీర్ఘంగా ఆలోచింపసాగాడు.

"ఏలావుంది శరభయ్య బాబాయి—" అని సుగుణ ఎంతో ఆత్రంగ అడిగింది.

"రోగం చాలా ముదరనిచ్చారమ్మా"

"అసలు జబ్బేమిటి?"

"సన్నిపాతం—"

"ఆ!" అని సుగుణ ఒక్కసారి బావురుమంది.

"విచారపడకమ్మా—" అన్నాడు ఎంతో జాలిగా,

"మందువాడు బాబాయి— డబ్బుకు భయపడవాకు

బాబాయి, ఏదో విధంగా ఇచ్చుకుంటాను— నీ రుణం తీర్చు కుంటాను— నా పిల్లవాణ్ణి బ్రతికించు బాబాయి......" అని ఎంతో దీనంగా విలపించింది.

"ఎందుకమ్మా. లాభంలేదు-కుణాలమీద...వుంది"

"అయ్యో!......" ".........."

"మంచివాడు... బాబాయి- మందు......" అని ఇంకా సుగుణ ఏమో అంటూవున్నది......

కృష్ణుడు నోటివెంట నురుగులు కక్కుతున్నాడు. ఏవో అస్పష్టంగా "పి...న్ని..." అని అనబోతున్నాడు మాట పెగిలి రావటంలేదు, స్పృహ తప్పిపోతోంది.

"బాగా దోషించిపోయింది, పాపం మంచిపిల్లవాడు... మంచం మీదినుంచి క్రిందికి దింపండి— ఇక లాభంలేదు. అంతా అయిపోయింది......" అని శరభయ్య అంటున్నాడు. ఆతని మాటలు వినిపించుకోకుండానే "కృష్ణుడూ! ఓ కృష్ణుడూ...... నా కృష్ణుడూ" అంటూ సుగుణ దభేలున్న క్రింద పడిపోయింది.

సూర్యభగవానుడు తన దినచర్య ముగించుకొని అప్పుడే తల్లిగర్భంలోకి జొరబడుతున్నాడు. అదే సమయం లో కృష్ణుడు తన భౌతికయాత్ర చాలించి ప్రకృతి మాతలో లీనమైపోయాడు,

కాస్సేపైన తరువాత సుగుణకు తెలివి [illegible] లేచి కూర్చుంది. కృష్ణుడి తలాపున, వున్న దీపాన్ని చూసి, [illegible] భోరున ఏడ్చింది. ఆమె కళ్ళు చండ్రనిప్పుల్లా ప్రజ్వరిల్లు తున్నాయి. ఆమె హృదయంలో హాలాహలం ప్రజ్వరిల్లింది. శరీరమంతా కంపించిపోతోంది. కృష్ణుడి భౌతిక దేహాన్నంతా ఒక్కసారి తన రెండు చేతుల్తో మమకారం కొద్ది నిమిరింది. అక్క చివరసారి తనతో "కృష్ణుణ్ణి నీ చేతిలో పెట్టిపోతున్నాను చెల్లీ! ఏం చేస్తావో భారమంతా నీది" అని చెప్పిన మాటలు గుర్తువచ్చాయి. ఆ మాటలే ఆమె చెవిలో ప్రతిధ్వనిస్తున్నాయి.

"అయ్యో! కృష్ణుడూ ఈ పాపిష్టిలోకం నుంచి పోయావా? నేను నీచుట్టూ నిర్మించుకున్న మహాసౌధాల్ని— పేక మేడలుగా చేసి, కూకటి వేళ్ళతో కూలదోశావా? నా కలలన్నీ పగటి కలలు చేశావా? నీవు బ్రతికుండి మందుకు గూడా నోచుకోలేదు— సానుభూతి— జాలినిగూడ పొందలేకపోయావు ఈ లోకంనుంచి— బాబూ! నీకు పరలోకాల్లో శాంతి సౌఖ్యం లభిస్తుంది. మన మిద్దరం అక్కడే కలుసుకుందాం తండ్రీ..." అంటూ సుగుణ పెరటిదొడ్లోవున్న బావివైపు పరుగెత్తి, అంధకారంలో అంతర్థానమైంది.

---